# మాల్టోవా ముఠా–
# వాళ్ళు ఎప్పుడేం చేస్తారో తెలియదింక !

ఉరకలువేసే చైతన్యం. ఆటా పాటల్లో, మస్తీ మజాల్లో అసలు సిసలైన ఉత్సాహం. అందుకే పిల్లలకు అవసరం, మాల్టోవా! బంగారమంటి గోధుమలు, బార్లీ, శుద్ధమైన పాలు, సమృద్ధిమైన కోకో, శక్తినిచ్చే చక్కెరల మంచితనం మాల్టోవాలో నిండుగా ఉంది మరి. మాల్టోవా పిల్లలకెంతో హితకరమైనదేకాక, పాలను మంచి రుచికరమైన పానీయంగా మార్చివేస్తుంది కూడా. మీ పిల్లలకు మాల్టోవా ఇవ్వడం ప్రారంభించండి.

**ప్రకృతి ఒడిలో పండిన గోధుమలు బార్లీల మాల్టు**

పంజాబులో పండిన గోధుమలు, బార్లీ, మాల్టోవా ప్లాంటులో పుష్టికరమైన మాల్టుగా మారిపోతాయి, ముఖ్యమైన ఖనిజాలు విటమిన్-Bతోటి మాల్టోవా సత్వరం శరీరంలో ఇమిడిపోయే జీర్ణీకృతాహారం.

**శుద్ధమైన, హితకరమైన పాలు**

మా స్వంత పాల సేకరణ కేంద్రాలద్వారా వస్తాయి, మాల్టోవాలో చేరే పాలు. ఇవి సదా నూటికి నూరుపాళ్లు శుద్ధమైనవి, నూరుపాళ్లు పుష్టికరమైనవి.

**నోరూరించే కోకో రుచి**

మేలైన విదేశీ కోకోనే మేము వాడుతాము. లేకపోతే మరి మీకు మంచి రుచి, మంచి పుష్టి ఎలా దొరుకుతాయి? కోకోతో కొత్త జీవం వస్తుంది. సేద తీరి విశ్రాంతికి దోహదమవుతుంది.

**శక్తికోసం చక్కెర**

ఏరి కోరి ఎన్నుకున్న శుద్ధమైన, తెల్లటి పంచదార, పిల్లలకవసరమైన ఆ అదనపు శక్తికోసం అతి ముఖ్యమైనది.

**విటమిన్లతో ప్రత్యేకించి పటిష్టం చేయబడింది**

ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, ఖనిజాల అద్వితీయ సమ్మేళనం మాల్టోవా. ఇది అదనపు విటమిన్-A, నియాసిన్, విటమిన్-B, విటమిన్-$D_2$లతో కూడా పటిష్టం చేయబడింది. కృత్రిమ సువాసనలిందులో లేవు.




JIL జగత్‌జీత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్
1981, 1982లో మాండే
(ప్రపంచ) ఎంపికలో బంగారు పతకాల విజేతలు

**విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం**

SIMOES/JIL/3/83 TEL

పార్లే

మెలడీ సమర్పిస్తోంది డోనాల్డ్ డక్ ను

# రాపర్ వేటలో.

బలే బలే.
మెలడీ టాఫీలు

కాని, నాడైసీ,
ఆ రాపర్లను మాత్రం
పారెయ్యకు. ప్రతి 10 కీ
ఒక స్టికర్ ఉచితంగా
దొరుకుతుంది.




## మీ డిస్నీ స్నేహితుల స్టికర్లు ఉచితంగా!

రండి పిల్లలూ! మీ ప్రియమైన డిస్నీ స్నేహితులను సేకరించటం వెంటనే మొదలుపెట్టండి. ఇందులో మొత్తం 30 ఉన్నాయి. ప్రతి స్టికర్ కోసం మీరు ఏం చెయ్యాలంటే, 10 మెలడీ టాఫీల రాపర్లు, మీ సొంత అడ్రెస్ వ్రాసిన ఒక కవరుపై 55 పైసల స్టాంపు అంటించి ఈ చిరునామాకు పంపండి.

మెలడీ టాఫీ, పార్లే ప్రొడక్ట్స్ ప్రై. లి.
నిర్లాన్ హవుస్, 254-బి, డా. అనిబిసెంట్ రోడ్,
బొంబాయి 400 025.

కొత్త పార్లే

# మెలడీ టాఫీ

కారమెల్ మరియు చాకలెట్ యొక్క
రుచికర మధుర సంగమం.




జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మనిషిలాంటి చిలుక'']కు ఆధారం ''వసుంధర'' రచన.

అజ్ఞానం, మూఢత్వాల్లో—మొదటిది మనిషిలో లోకజ్ఞానం లోపించడంవల్లా, రెండవది దేన్నీ తరచిచూడకుండా నమ్మడంవల్లా కలిగేవి. ''వెర్రి వెంగళప్పలు'' అన్న కథలో, పై రెండు లక్షణాలూ కల మనుషులు ఎంత హాస్యాస్పదంగా ప్రవర్తిస్తారో మనం తెలుసుకుంటాం.

## అమరవాణి

న సా విద్యా న తద్విత్తం, న సా శక్తి ర్న తద్బలమ్,
యది విద్యాధనే శక్తి, బలే న్యోపకృతా న చేత్.

[మనకు వున్న విద్య, ధనము, శక్తి, బలము యితరులకు ఉపయోగ పడని యెడల; అవి నిజమైన విద్యాధనములు, శక్తిబలములు కానే కావు.]

సంపుటి 74 ఫిబ్రవరి '84 సంచిక 2

విడి ప్రతి: 2-00 :: సంవత్సర చందా: 24-00



# చందమామ కబుర్లు



## ఎగిరే వింత జంతువులు

కొన్ని కోట్ల సంవత్సరాల కిందట ఈ భూమి మీద 'టిరోసార్స్' అనే వింత ప్రాకుడు జంతువులు వుండేవి. పదహారు మీటర్ల పొడవు గల రెక్కలతో, అలా గాలిలో తేలిపోయే, ఈ జాతి వింత జంతువులు, లక్షలకొద్ది సంవత్సరాలు జీవించినట్టు తూర్పు టెక్సాస్‌లో లభించిన శిలావశేషాల ద్వారా బయటపడింది.

## వ్యోమ మండలానికి వినోదయాత్ర



అమెరికాలోని 'నాసా', రాక్వెల్ అంతర్జాతీయ విజ్ఞాన సంస్థకు చెందిన శాస్త్రవేత్తలు కొందరు కలిసి, ఒక వ్యోమనౌకను రూపొందిస్తున్నారు. ఈ వ్యోమనౌక డెబ్బైనాలుగు మందిని 'వ్యోమ విడిది'కి తీసుకుపోగలదు. 1990వ సంవత్సరం తరవాత తొలి జట్టు బయలుదేరగలదని అభిజ్ఞవర్గాల ద్వారా తెలుస్తున్నది. ఈ వ్యోమ నౌకాయానంలో ఒక్క ప్రయాణీకుడికి అయ్యే ఖర్చు ఇరవైలక్షల డాలర్లు దాటగలదని అంచనా!



## అద్దంలాంటి బంగారం

న్యూ మెక్సికోలోని, లాస్ అలమస్ జాతీయ ప్రయోగశాలలో విజ్ఞాన వేత్తలు బంగారు ముక్కను తీసుకుని, అవతలి వస్తువు కనబడేంత పలుచగా సాగదీశారు. దీని మందం అంగుళంలో పది లక్షల వంతు కన్నా తక్కువ.

# మీకు తెలుసా?

1. కలకత్తా నగరాన్ని నిర్మించిందెవరు? ఎప్పుడు?
2. క్రైస్తవ మతం గురించి తెలుసుకోడానికి ఆసక్తి కనబరచిన మొగల్ చక్రవర్తి ఎవరో మీకు తెలుసా?
3. అలెగ్జాండర్ భారతదండయాత్ర గురించి రాసిన చరిత్రకారుడెవరు?
4. పందొమ్మిదో శతాబ్దంలో భారత దేశ భూభాగాన్ని కొంత ఆక్రమించుకున్న విదేశ రాజు ఎవరో మీకు తెలుసా?
5. భారతదేశంలో ఆంగ్ల విద్యా బోధనను ప్రారంభించిన వారెవరు?

(సమాధానాలు 64వ పేజీలో)



# పరోపకారి

నారాయణవరం గ్రామంలో వుండే రమణయ్య చాలా పరోపకార బుద్ధిగలవాడు. ఒకసారి పెద్ద గాలివాన తాకిడికి గ్రామంలో చాలామంది గుడిసెలు పడిపోతే, అతను ఇంటింటికీ తిరిగి చందాలు పోగుచేసి, నష్టపోయిన వాళ్ళందరికీ కొత్త గుడిసెలు కట్టించాడు. ఇందుకు దాదాపు గ్రామంలో కలిగిన వాళ్లంతా సాయపడ్డారు. కాని, ధనగుప్తుడనే షావుకారు మాత్రం రమణయ్యకు ఒక్క పైసా కూడా చందా యివ్వలేదు.

రమణయ్య తనకు ఘనంగా చందాలిచ్చిన వాళ్ళ పేర్లు చెప్పబోతే, ధనగుప్తుడు అడ్డు తగిలి, ''అనవసరంగా కంఠశోష పడకు. గుడిసెలు పోయిన వాళ్ళెవరూ వచ్చి డబ్బు కోసం దేవిరించలేదు. ఎందుకో తెలుసా? అడుక్కోవడం ఎవరికీ యిష్టం వుండదు. అడుక్కునే బుద్ధి వున్నవాళ్ళే, నీలాగా చందాలంటూ ఎగబడతారు. ఇందులో ఎంతో కొంత మిగుల్చుకోవాలని, నువ్వు ఆశపడుతున్న సంగతి నాకు తెలుసు. నీబోటి వాళ్ళకు, ఏనాడూ సహకరించను!'' అన్నాడు.

గ్రామంలో చాలామంది రమణయ్యను దేవుడంటూ పొగిడారు. అయినా అతడికి తృప్తి కలగలేదు. ధనగుప్తుడు తనను నానా మాటలూ అన్నాడు గనక, ఎలాగైనా అతడికి బుద్ధిచెప్పాలని రమణయ్య తాపత్రయం.

ఉన్నట్టుండి ఒకరోజు అతను ధనగుప్తుడి దగ్గిరకు వెళ్ళి, ''తెలుసో లేదో, గ్రామం, గ్రామం అంతా నన్ను పొగడుతున్నది. ఉన్నవాళ్ళలో నువ్వు తప్ప, అందరూ చందాలిచ్చారు. చందా యిచ్చి వుంటే, నీకూ తృప్తిగా వుండేది గదా!'' అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



ధనగుప్తుడు కోపంగా, ''నా దగ్గిర ఎందరో అప్పులు తీసుకుని, రోజూ నన్ను పొగిడి వెళుతూంటారు. డబ్బున్నంత కాలం నేను యితరుల మెప్పు కోసరం ఏమేమో చేయనవసరం లేదు. ఊరూ పేరూ లేని నీ వంటి చవటలే పరోపకారం అంటూ బయల్దేరుతారు. ఇతరులిచ్చిన డబ్బుతో పరోపకారం చేసి పొగడ్త లందుకుంటారు,'' అని అవమానించి పంపేశాడు.

రమణయ్యకు విపరీతంగా కోపం వచ్చింది. ఈ జరిగింది విని అతడి తండ్రి, ''ధనగుప్తుడి నోరు మంచిది కాదు. అలాంటి వాడికి దూరంగా ఉండడం ఉత్తమం. నువ్వు పదిమందికీ సాయపడా లనుకుంటే; సాయపడు. కాని, ఆ ధన గుప్తుణ్ణి గురించి పట్టించుకోకు,'' అని సలహా యిచ్చాడు.

తండ్రి సలహా రమణయ్యకు నచ్చ లేదు. అతను స్నేహితులకు జరిగింది చెప్పుకున్నాడు. వాళ్ళు రమణయ్యను ఓదార్చుతూ, ''ఆ ధనగుప్తుడన్నంత మాత్రాన నువ్వు చవటవైపోతావా? అలాం టివి పట్టించుకోకు,'' అన్నారు.

ఆశ్చర్యమేమంటే, రమణయ్య వల్ల ఉపకారం పొందినవాళ్ళు కూడా, ''మీరు దేవుడిలాంటివారు కాబట్టి, అందరిచేతా మాటలుపడి మాకు ఇళ్ళు కట్టించారు,'' అని అతణ్ణి మెచ్చుకున్నారే తప్ప, ధన గుప్తుడి ప్రవర్తనను ఎవరూ ఖండించలేదు.

ఈ గొడవ విన్న ఊరిపెద్దలు, రమ ణయ్యను రచ్చబండ వద్దకు పిలిచి, ''ఒరే, ధనగుప్తుడిది దుందుడుకు ధోరణి. అయినదానికీ, కానిదానికీ మాట జారుతూంటాడు. నువ్వు బాధపడకు. అత గాణ్ణి మందలించాలనే మాకూ వున్నది. కాని, అందువల్ల ప్రయోజనం వుండదు. మమ్మల్ని పురుగుల కింద తీసిపారే స్తాడు,'' అన్నారు ఊరడిస్తూ.

ఇంత జరిగాక రమణయ్య, ధనగుప్తుణ్ణి గురించి కొంత లోతుగా ఆలోచించాడు.

ధనగుప్తుడికి బాగా డబ్బున్నది. గ్రామంలో అందరికీ అతడితో అంతో యింతో అవసరం వున్నది. అందువల్లనే, ధనగుప్తుణ్ణి తప్పు పట్టడానికి అందరూ భయపడుతున్నారు!

తన కసి తీరేలాగా ధనగుప్తుణ్ణి అవమానంపాలు చెయ్యడం ఎలా అని, రమణయ్య పథకాలు వేస్తూండగా, అతడికి ఒక మంచి అవకాశం చిక్కింది.

దూరప్రాంతం నుంచి మల్లుడొకడు రమణయ్య ఇంటికి వచ్చి, "మల్లవిద్యలో నాకు ఎన్నో మెలుకువలు తెలుసు. అవన్నీ ప్రదర్శించి, మీ గ్రామస్థులకు వినోదం కలిగిస్తాను. అందరూ కలిసి, నాకు వంద వరహాలిస్తే తృప్తిపడతాను," అన్నాడు.

రమణయ్యకు, ధనగుప్తుడి మీద పగ తీర్చుకునేందుకు, యిదే మంచి అదను అనిపించి, "ఇటువంటి పనులు నావల్ల కావు. గ్రామంలో ధనగుప్తుడనే ఆయన వున్నాడు. ఆయనకు మల్లవిద్యలంటే భలే సరదా. వెళ్ళి అడిగావంటే తప్పక సహాయం చేస్తాడు," అన్నాడు.

మల్లుడు ధనగుప్తుడి ఇంటికి వెళ్ళి, తన ప్రతిభను గురించి చెప్పుకుని, "తమకు మల్లవిద్యలంటే చాలా యిష్టమని విన్నాను. నా వినోదప్రదర్శనకు తగిన ఏర్పాట్లు చేయించి, బహుమతిగా నూరు వరహాలిప్పించండి," అన్నాడు.

ధనగుప్తుడికి మల్లుడి మాటలు వింటూనే చాలా కోపం వచ్చింది. ఆయన



మల్లుడి కేసి చీడపురుగును చూసినట్టు చూస్తూ, "ఒళ్ళు పెంచుకుని తిండికోసం యితర్ల మీద ఆధారపడే వాళ్ళంటే, నాకు అసహ్యం. మల్లవిద్యలంటే, నాకు పరమ రోత. వచ్చిన దారినే వెళ్ళు," అని మల్లుణ్ణి అవమానించాడు.

మల్లుడు పళ్ళు కొరుకుతూ, రమణయ్య దగ్గిరకు తిరిగి వచ్చి, "నువ్వు, నాకు అబద్ధం ఎందుకు చెప్పావు? ఆ ధనగుప్తుడికి మల్లవిద్యలంటే రోతట. నన్ను నానా మాటలూ అన్నాడు. నీ వల్ల బతుకులో మొదటిసారిగా మాటపడవలసి వచ్చింది," అన్నాడు.

"అలాగా! ఆ ధనగుప్తుడు కూడని మాటలంటూంటే పడి వూరుకున్నావా? నీవు మల్లుడివి కాదా—నీ విద్య చూపించలేవా?" అన్నాడు రమణయ్య, మల్లుణ్ణి రెచ్చగొడుతూ.

"అవును, నా విద్య చూపిస్తాను!" అంటూ మల్లుడు, రమణయ్యను గట్టిగా నాలుగైదు దెబ్బలు వేశాడు.

రమణయ్య బాధతో మూలుగుతూ, "ఆ దుష్టుడు నిన్ను తిడితే, నన్ను కొడతావెందుకు?" అని అడిగాడు.

"నీకు వాడి మీద ఏదో పగ వున్నదని, నాకు అర్థమైంది. నా చేత వాణ్ణి కొట్టించాలని నువ్వు పథకం వేశావు. నేను మల్లుణ్ణే కాని, నీ నౌకరును కాదు. ధనగుప్తుడు, నీ కారణంగానే నన్ను తిట్టాడు. అందుకే నేను, నిన్ను కొట్టాను!" అని చెప్పి మల్లుడు వెళ్ళిపోయాడు.

ఈ సంగతి తెలిసిన రమణయ్య తండ్రి, అతణ్ణి గట్టిగా మందలిస్తూ, "ఆ ధనగుప్తుడు కందిరీగల తుట్టెలాంటివాడు. కోరి కదిలించి బాధలెందుకు తెచ్చుకుంటావు? ఇక ఏనాడూ అతడి జోలికి వెళ్ళకు. నిజమైన పరోపకారి తిట్లూ, దీవెనలూ రెంటినీ అంతగా పట్టించుకోకూడదు," అని చెప్పాడు.

ఆ తరవాత రమణయ్య, చందాల కంటూ పోయి, ఏనాడూ ధనగుప్తుడితో మాటపడలేదు.






## 10

[భల్లూకకేతుడు రక్కసిమూకకు నాయకుడుగా వుండేందుకు అంగీకరించలేదు. చేసేది లేక పద్మపాదుడు తిరిగి తన దేశానికి బయలుదేరాడు. అక్కడ పింగళుడు, పద్మపాదుడికి వారం రోజులు అతిథిగా వుండి, తరవాత భల్లూకకేతుడు వాహనంగా తన యిల్లు చేరాడు. ఇంటి ముందు అతనికి, తన తల్లి దీనంగా బిచ్చం అడుగుతూ వుండటం కంటపడింది. తరవాత—]

పింగళుడి కంఠస్వరం వింటూనే, తల్లి అతణ్ణి గుర్తించి, కళ్ళవెంట జలజల నీరు కారుస్తూ, ''నాయనా, ఎన్నాళ్ళకు నిన్ను చూడగలిగాను!'' అంటూ అతణ్ణి కావిలించుకున్నది. పింగళుడు ఆమెను ఓదారుస్తూ, ''అమ్మా, నీ స్థితి యిలా అవటానికి కారణం ఏమిటి? నేను ప్రయాణం అయి వెళ్ళేముందు నీకు వెయ్యి మొహరీలు యిచ్చాను గదా? ఆ డబ్బు ఏమయింది? యింతకూ నా అన్నలు ఎక్కడ వున్నారు?'' అని అడిగాడు. తల్లి వెంటనే జవాబు చెప్ప లేక కొట్టుమిట్టాడింది. చివరకు ఆమె కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, ''నీ అన్నల వల్లనే నాకీ కష్టాలన్నీ వచ్చాయి. నువు అటు వెళ్ళగానే, వాళ్ళిద్దరూ నన్ను తిట్టి కొట్టి, ఆ వెయ్యి మొహరీలూ లాక్కు పోయారు,'' అన్నది.



తల్లి మాటలు వింటూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. కన్న తల్లిని హింసించే కటిక దుర్మార్గులు తన అన్నలన్న సంగతి అతడికి చాలా బాధ కలిగించింది. అయినా, తనకై తాను ఆ సోదరులను వాతమార్చ ప్రయత్నించటం ధర్మం అనిపించుకోదు.

పింగళుడు బక్కచిక్కపోయిన తల్లిని లేవనెత్తి ఇంట్లోకి తీసుకుపోతూ, "అమ్మా, యిక నీవు దుఃఖించవలసిన అవసరం లేదు. భగవంతుడి దయవల్ల నేను అన్ని పరీక్షలకూ నిలబడి, ఎంతో డబ్బుతో యిల్లు చేరాను. నీ కష్టాలూ, నా కష్టాలూ కూడా యీ నాటితో తీరిపోయినై," అంటూ తను వెంట తెచ్చిన సంచీ మూత వూడదీసి, అందులో వున్న బంగారం, రత్నాలూ, మణులూ తల్లికి సంతోషంగా చూపించాడు.

తల్లి ఆనందానికి మేరలేదు. ఆమె రెండు చేతులతో సంచీలో వున్న బంగారాన్నీ, యితర విలువైన వస్తువులనూ తాకి చూస్తూ, "నాయనా, నువ్వు అదృష్టశాలివి! అందువల్లనే ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని కూడా క్షేమంగా బయటపడ గలిగావు. నాకు ఆకలి దహించుకు పోతున్నది. ముందు బజారుకు వెళ్ళి, యిన్ని రొట్టెలూ, ఏదైనా కూరా తెచ్చి పెట్టు!" అన్నది.

తల్లి మాటలకు పింగళుడు పకాలున నవ్వాడు. తరవాత ఆమెను గోడపక్కనే వున్న ఒక పీటమీద కూర్చొపెట్టి, ముందు పెద్ద విస్తరి పరిచి, తన వెంట వున్న మంత్రాల సంచిని ఆమెకు చూపిస్తూ, "అమ్మా, నీకు ఎలాంటి పదార్థాలు కావాలో కోరుకో! అన్నం, కూరలే కాదు, ఎన్ని రకాల పిండివంటలైనా సరే, క్షణంలో నీకు సమకూరుస్తాను," అన్నాడు.

"పింగళా, ఆకలితో ప్రాణం తడబడుతున్న నాకు పిండివంటలెందుకు? ముందు బజారుకు వెళ్ళి యిన్ని రొట్టెలు పట్టుకురా, చాలు!" అన్నది తల్లి.



పింగళుడు తల్లి పక్కనే కూర్చుని సంచీలోకి చేయి పోనిచ్చి, మంత్రం పఠించి, అందులో నుంచి వేడివేడిగా వున్న రొట్టెలను బయటికి లాగాడు. యిదేదో వింతగా భావించి, ఆశ్చర్య పడుతున్న తల్లి మారుమాటాడక ముందే, పింగళుడు సంచీలోంచి ఒక్కొక్కటిగా పంచభక్ష్యపరమాన్నాలూ, నూట ఒక్క పిండివంటలూ బయటికి లాగి, తల్లి ముందున్న విస్తట్లో, దాని చుట్టూ దొంతర్లుగా అమర్చాడు.

తల్లి ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె తన ముందున్న తినుబండారాలకేసి కళ్ళింత చేసుకు చూస్తూ, "నాయనా, యిది మంత్రమో, మహత్తో నాకు తెలియటంలేదు. అంత చిన్న సంచీలో యిన్ని పదార్థాలు ఎలా దాచగలిగావు?" అని అడిగింది.

పింగళుడు మంత్రాల సంచిని మడిచి తన పక్కన పెట్టుకుని, ఒక్కొక్క వంట కాన్నే రుచి చూస్తూ, "అమ్మా, అదంతా తరవాత చెపుతాను. ముందు భోజనం ముగించు," అన్నాడు.

కొద్దిసేపట్లో పింగళుడితోపాటు తల్లి కూడా తృప్తిగా భుజించింది. పింగళుడు ఖాళీ పళ్లాలన్నిటినీ తిరిగి సంచీలో పెట్టి, దాన్ని తల్లికి అందిస్తూ, "అమ్మా, యీ నాటి నుంచి నువ్వు వంట చేయనవసరం లేదు. యీ సంచీలో అద్భుతమైన ఒక శక్తి వుంది. దాని ప్రభావంవల్ల మనం ఎలాంటి వస్తువును కోరుకుని, అందులో చెయ్యి పెడతామో, ఆ వస్తువు వెంటనే లభిస్తుంది. ఆ సమయంలో మనం పఠించవలసిన మంత్రం యిది!" అంటూ తల్లి చెవిలో మంత్రం చెప్పి "ఈ రహస్యం ఎవరికీ తెలియనివ్వకు!" అన్నాడు.

అంతలో వీధివాకిట్లో ఎవరో పెద్దగా ఏడుస్తూ తల బాదుకుంటున్న ధ్వని అయింది. పింగళుడు అదేమిటో తెలుసుకునేందుకు వీధివాకిలి తెరిచి బయటికి చూశాడు. ఎదురుగా, గుమ్మం పక్కన

అన్నలిద్దరూ—జీవదత్తుడూ, లక్షదత్తుడూ చిరిగి మట్టి కొట్టుకున్న గుడ్డలతో, చింపిరి తలలతో ఏడుస్తూ అతడికి కనిపించారు.

తన అన్నలిద్దరూ అంత దీనావస్థలో కనబడేసరికి, పింగళుడిలో వారి మీద ఎక్కడలేని సోదరప్రేమా వెల్లివిరిసింది. అతడు వారిని సమీపించి, "అన్నల్లారా, ఏడవకండి! దైవకృపవల్ల నేను యింత ధనం సంపాయించి, క్షేమంగా యింటికి తిరిగొచ్చాను. మన కష్టాలన్నీ తీరినై, యిక మనం హాయిగా బతకవచ్చు," అన్నాడు.

పింగళుడు యిలా అనేసరికి జీవదత్తుడూ లక్షదత్తుడూ ముఖాముఖాలు చూసుకున్నారు. ఆ వెంటనే జీవదత్తుడు మరింత పెద్దగా ఏడుస్తూ తల బాదుకుని, "తమ్ముడూ, పింగళా! ఈ రోజుతో మా జీవితాలు ముగిసినట్టే. మేము అమ్మకు ఎంత అన్యాయం చేశామో, ఆమె నీకు చెప్పేవుంటుంది. ఇక ఏ ముఖం పెట్టుకు మేము యీ యింట్లో అడుగు పెట్టగలం! యింత కాలంగా నీ రాకకోసమే ఎదురు చూస్తున్నాం. ఆ చిలక సరస్సులో పడి చావదలుచుకున్నాం. అప్పుడు గాని మా పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం జరిగినట్టు కాదు. అమ్మకు వేయి నమస్కారాలు. మా తప్పులు క్షమించు, యిక సెలవు!" అంటూ వెనుదిరిగాడు. అతడితోపాటే లక్షదత్తుడు కూడా బయలుదేరాడు.



పింగళుడు చెంగున ఒక్క గంతులో అన్నలిద్దరికీ అడ్డంగా నిలబడి, "అన్నల్లారా, ఆగండి! యిప్పుడు మీరెక్కడికి వెళుతున్నారు?" అన్నాడు.

"ఎక్కడికా? అహ్హహ్హా!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ పిచ్చివాళ్ళలా నవ్వి, "తమ్ముడూ, దారి తొలుగు! మా పాపాలకు ప్రాయశ్చిత్తం జరిగి తీర వలసిందే! తల్లిని రంపాన రాసినపాపులకు, ఆ చిలక సరస్సే శరణ్యం!" అంటూ ముందుకు నడవబోయారు.

ఇంతలో తల్లి కూడా వీధివాకిలి దగ్గిరకు వచ్చి, తన పెద్దకొడుకులిద్దర్నీ చూసి ఎంతో జాలిపడింది. ఆమె ఆ క్షణంలో, వాళ్ళిద్దరూ తనకు గతంలో చేసిన అన్యాయాన్ని మరిచిపోయి, ఎక్కడ లేని పుత్రప్రేమతో వారిని సమీపించి, "నాయనలారా, ఏడవకండి! దేవుడు దయవల్ల మీ చిన్న తమ్ముడు ఎంతో ధనం సంపాయించి క్షేమంగా తిరిగివచ్చాడు. జరిగిపోయిన దాన్ని మరిచిపోయి, యిక నుంచైనా సుఖంగా కాలక్షేపం చేద్దాం!" అన్నది.

"అయితే మా పాపాలకు ప్రాయశ్చిత్తం మాటేమిటి?" అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ, ఏకకంఠంతో.

"పశ్చాత్తాపం అనేది అన్ని పాపాలను హరిస్తుంది. యిక వెనుదిర్గి యింట్లోకి రండి!" అన్నాడు పింగళుడు, జీవదత్తుడి చెయ్యి పట్టుకుంటూ.





తల్లి కూడా తన పెద్దకొడుకులకు అడ్డుగా నిలబడి, "నాయనలారా, యిక యింట్లోకి పదండి! చిన్నతనం వల్ల, మీరు తెలిసీ తెలియక నాకేమైనా అన్యాయం చేసివుంటే, తల్లినైన నేను మర్చిపోగలను," అంటూ కొడుకులిద్దరి చేతులూ పట్టుకున్నది.

ఆ తరవాత అయిష్టంగానే ముక్కుతూ, మూలుగుతూ, జీవదత్తుడూ, లక్షదత్తుడూ యింట్లోకి వచ్చారు. తల్లి అప్పటికప్పుడు వాళ్ళిద్దరికీ స్నానానికి నీళ్ళు తోడి, కట్టుకునేందుకు పింగళుడు వెంట దెచ్చిన ఖరీదైన పట్టువస్త్రాలు యిచ్చింది. వాళ్ళిద్దరూ స్నానాలు చేసి, ఆ పట్టుదుస్తులు ధరించి, తల్లినీ, పింగళుణ్ణీ ఎంతో ఆప్యాయంగా కావిలించుకుని, "తినటానికేమైనా వుంటే పెట్టండి, ఆకలి దహించేస్తున్నది," అన్నారు.

పింగళుడు మంత్రాల సంచీ తీసుకుని, వంటగదిలోకి వెళ్ళి, తల్లికి దాన్ని యిచ్చి, అన్నల దగ్గిరకు వచ్చి కూర్చున్నాడు. నాలుగైదు నిమిషాల తరవాత తల్లి రకరకాల భోజనపదార్థాలు పళ్ళాల్లో పెట్టుకుని వచ్చి పెద్ద కొడుకుల ముందు పెట్టింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఆవురావురుమంటూ కొంతసేపు తిని, ఆ తరవాత "అమ్మా, యిన్ని రకాల పదార్థాలు వండావెందుకు? మేమేమీ అతిథులం కాదు గదా! అనవసరంగా డబ్బు ఖర్చు," అన్నారు.

పింగళుడు నవ్వుతూ, "అన్నల్లారా! మనం ప్రతి రోజూ యిలాంటి భోజనమే చేయవచ్చు. కావాలంటే, యీ పట్టణంలో వున్న బీదసాదలకు కూడా, యింత విలువగల భోజనం పెట్టవచ్చు," అన్నాడు నెమ్మదిగా.

పింగళుడి మాటలు వింటూనే జీవదత్తుడు, లక్షదత్తుడికి సంజ్ఞ చేశాడు. అతడు కూడా ఏదో అర్థమైందన్నట్టు తల వూపి వూరుకున్నాడు.

ఆ రాత్రి భోజనాల తరవాత జీవదత్తుడూ, లక్షదత్తుడూ చల్లగాలికి వీధిలోకి వెళ్ళివస్తామని బయలుదేరారు. వాళ్ళిద్దరికీ పింగళుడు చాలా ధనం వెంటబెట్టుకు వచ్చాడనేది తెలిసిపోయింది. ఆ డబ్బు దొరకపుచ్చుకోవటం ఎట్లా? అన్నది వాళ్ళకు పెద్దసమస్య. ఇంకొకటి: జీవదత్తుడికి తన తల్లి ఆ ఉదయంగాని, సాయంకాలంగాని పొయ్యి రాజేసినట్టు కనబడలేదు. అతడు వంటగదిలోకి వెళ్ళి, గదంతా పరీక్షించి వచ్చాడు. వంట చెయ్యకుండానే, యిన్ని పదార్థాలు ఎక్కడ నుంచి వస్తున్నవో అతడికి అర్థం కాలేదు.



"పింగళుడు చాలా డబ్బు తెచ్చాడు, అందులో సందేహం లేదు. పోతే, దాన్ని మనం దొరకపుచ్చుకోవాలంటే మరి కొంతకాలం పడుతుంది. మనం పశ్చాత్తాప పడుతున్నామని అమ్మతో పాటు వాడికీ నమ్మకం కుదిరింది. అది అట్లా వుంచుదాం. మనం యీ రెండు పూటలా విందు భోజనాలు చేశాం కదా! వంటింట్లో చూస్తే పొయ్యి రాజేసిన లక్షణాలే లేవు. ఇది వింతగా లేదా?" అన్నాడు జీవదత్తుడు.

లక్షదత్తుడు ఆశ్చర్యపడుతూ తల పంకించి, "అలా అయితే, పింగళుడు ఏదో మంత్రమో, తంత్రమో నేర్చుకు వచ్చి, యిదంతా చేస్తూ వుండివుండాలి. అందుచేతే వాడు అంత ధీమాగా పట్టణంలో వున్న బీదసాదలందరికీ యీ భోజనమే పెట్టవచ్చని అన్నాడు. సమయం కనిపెట్టి అమ్మనడిగితే, యీ రహస్యం బయటపెట్టేస్తుంది," అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ మర్నాడు పింగళుడు యింటలేని సమయం కనిపెట్టి, తల్లి పక్క చేరి, యీ సంగతి అడిగారు. ఆమె చాలాసేపటివరకూ పింగళుడు తెచ్చిన మంత్రాల సంచీని గురించి చెప్ప లేదు. కాని కొడుకులిద్దరూ బతిమాలే సరికి, మరెవరికీ తెలియకూడని రహస్యం

అంటూ మంత్రాల సంచీ తెచ్చి వాళ్లిద్దరికీ చూపింది.

"అమ్మా, ఆ మంత్రం ఏదో నాకు చెప్పు! నాకు యీ క్షణాన జిలేబీలు తినాలనివుంది," అన్నాడు జీవదత్తుడు.

తల్లి కొడుకుల మీది ప్రేమకొద్దీ, వాళ్లు లోగడ తనను పెట్టిన హింసలు మరిచి పోయి, వాళ్ళకు ఆ మంత్రం చెప్పి, సంచీలోంచి వాళ్ళ చేతే, కావలసిన పదార్థాలన్నీ బయటికి తీయించింది. దానితో జీవదత్తుడీ, లక్షదత్తుడీ ఆనందం హద్దులు దాటిపోయింది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ పింగళుడి మీదా, తల్లి మీదా కుట్ర పన్నారు. ముందు పింగళుణ్ణి యింట్లో లేకుండా చేస్తే, తల్లి తమనేమీ చేయలేదని వాళ్ళకు తెలుసు. కాని, పింగళుణ్ణి వదిలించుకోవటం ఎట్లా?

"మొన్న పెద్ద బజారున వస్తూంటే, ఒక ఓడసరంగు కనిపించాడు. అతడికి సముద్రాల మీద పడవలు నడిపేందుకు యువకులైన నావికులు కావాలట! అవసరం అయితే, ఎంత డబ్బయినా యిచ్చి, ఇంటి పెద్దల నుంచి యువకులను కొంటున్నాడు. మనం ఆయనతో మాట్లాడి, పింగళుణ్ణి అతడికి అమ్మేద్దాం! మనం యీ యింటికి పెద్దవాళ్ళం గదా?" అన్నాడు జీవదత్తుడు.

"మంచి యోచన! ఆ సరంగును కలుసుకుని మాట్లాడదాం పద," అన్నాడు లక్షదత్తుడు. అన్నదమ్ములిద్దరూ సరంగు విడిది చేసిన యింటికి పోయారు. అతడు వీళ్ళకు అన్ని మర్యాదలూ చేసి వచ్చిన పనేమిటని అడిగాడు. అప్పుడు జీవదత్తుడు లేని దుఃఖం తెచ్చిపెట్టుకుని, "అయ్యా, సరంగుగారూ! మా తమ్ముడు పింగళుడనేవా డొకడున్నాడు. వాడు వట్టి గడుగ్గాయిలా తయారై యింటిపట్టున వుండక, అవసరం అయినప్పుడల్లా వృద్ధురాలైన మా అమ్మనూ, మమ్మల్నీ హింసించి డబ్బు గుంజుకుపోతూంటాడు. వాడిని వదిలించుకోవటం ఎలాగో మాకు తెలియకుండావుంది," అన్నాడు.—(ఇంకావుంది)






# మనిషిలాంటి చిలుక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, యీ భయంకర శ్మశాన ప్రదేశాన నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నాకు జాలి కలుగుతున్నది. చేపట్టిన కార్యం సాధించి తీరాలనే పట్టుదల మెచ్చదగిందే. కాని, అది నీ కోసమా, పరుల కోసమా అన్న సంశయం నన్ను వేధిస్తున్నది. ఒకవేళ, నీ యింత కఠోర దీక్ష పరుల కోసమైతే మాత్రం, నువ్వు తగు జాగ్రత్తతో మెలగాలి. ఒక్కొక్కసారి సహాయం పొందిన వాళ్ళ నుంచి, సన్మానం జరగకపోగా, అవమానం ఎదురయ్యే ప్రమాదం వున్నది. ఇందుకు ఉదాహరణగా నీకు, మనిషిలాంటి చిలుక కథ

## బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

ధారానగరంలో నివసించే సుదర్శనుడికి అందమూ, వినయశీలతా వున్న భార్యా, బుద్ధిమంతులైన పిల్లలూ వున్నారు. అనుభవించడానికి పెద్ద ఆస్తి వున్నది. అన్నీ వున్నప్పటికీ ఎందుకో ఆయన ఎప్పుడూ దిగులుగా వుండేవాడు. ఎంతమంది, ఎన్నివిధాలుగా ప్రయత్నించినా, ఆయన మనసుకు ఉల్లాసంకలిగేది కాదు.

ఒకరోజున చిన్న పంజరంతో ఒక మనిషి సుదర్శనుడి దగ్గిరకు వచ్చాడు. పంజరంలో అందమైన రామచిలుక వున్నది. ఆ మనిషి సుదర్శనుడితో, ''అయ్యా, ఇది మాటలు నేర్చిన చిలుక. తమకు మానసికోల్లాసం కలిగించే ఎన్నో కథలు చెప్పగలదు. వెయ్యి వరహాలిస్తే, దీన్ని మీకిస్తాను,'' అన్నాడు.

సుదర్శనుడు చిలుకను పరీక్షించి చూశాడు. దాని మాటలు వింటూంటే, ఆయనకెంతో ముచ్చట వేసింది. వెయ్యి వరహాలిచ్చి, దానిని కొన్నాడు.

మొదట్లో ఇంట్లోని వారందరూ కూడా చిలుక అంటే యిష్టపడేవారు. కానీ, సుదర్శనుడు రోజంతా చిలుక ధ్యాసలోనే వుండడంతో, మిగతా అందరికీ చిలుక అంటే అసూయ బయల్దేరింది. దాని ధ్యాసలోపడి సుదర్శనుడు, భార్యతో మాట్లాడడం తగ్గించేశాడు. వ్యాపార విషయాలన్నీ పిల్లలకు వదిలి పెట్టేశాడు.

ఈ ధోరణి బాగా లేదని ఇంట్లో ఎవరైనా అంటే, ఆయన, ''నా మనసులో వున్న దిగులును చిలుక మాత్రమే పోగొడుతున్నది,'' అని బదులిచ్చేవాడు.

''చిలుక మరీ అంత తెలివైనదైతే, నీ మనసులోని దిగులు ఎలా పోతుందో, ఉపాయం చెప్పలేదా?'' అన్నారు సుదర్శనుడి పిల్లలు.

అదీ నిజమేనని ఆయన చిలుకను తన దిగులుపోయే ఉపాయం గురించి అడిగాడు.

"పంజరంలో వున్నవాళ్ళు, ఎదుటి వాళ్ళ దిగులు పోగొట్టగలరు కానీ, తమ దిగులు పోగొట్టుకోలేరు. నీవు, నీ కోసం మాత్రమే కాక, యితరుల కోసం కూడా జీవించడం అలవాటు చేసుకుంటే— స్వార్థం అనే పంజరం నుంచి బయట పడి—దిగులును పోగొట్టుకోగలుగుతావు," అని చెప్పింది చిలుక.



ఆరోజు నుంచీ సుదర్శనుడు తనకున్న దానితో, లేనివారిని ఆదుకొనడం ప్రారంభించాడు. ఆ విధంగా అతడికి పది మందిలో మంచి పేరు వచ్చింది.

ఇప్పుడు నిజంగానే సుదర్శనుడి మనసుకెంతో సంతోషంగా వుంటున్నది. అతడు అస్తమానం చిలుకతో కాలం గడపడం తగ్గించి, వ్యాపార వ్యవహారాలు కూడా చూడసాగాడు.

తండ్రి దానగుణం పిల్లలకు నచ్చలేదు. వాళ్ళొక రోజున సుదర్శనుడితో, "చిలుక మనిషిలా మాట్లాడడం అసహజం! మనం నేర్పిన పలుకులు తిరిగి చెప్పడం వరకే వాటివల్ల అవుతుంది. కానీ, పూర్తిగా మనిషిలా ఆలోచించడం చిలుకకు సాధ్యపడదు. ఇదేదో మంత్రపు చిలుక అని మాకు అనుమానంగా వున్నది. మీవద్ద వున్న డబ్బును దానంగా పొందడానికని ఎవడో, ఈ చిలుకను మీ వద్దకు పంపించాడని, మాకు అనిపిస్తున్నది," అన్నారు.

సుదర్శనుడు చిలుకను, "సాధారణంగా పక్షులేమీ ఆలోచించలేవు. నీకిలాంటి శక్తి ఎలా వచ్చింది?" అని అడిగాడు.

"ఒకప్పుడు విక్రమార్కుడనే రాజు చిలుక రూపంలో జీవించాడు. అప్పుడాయన ఒక చిలుకను వివాహం చేసుకున్నాడు. ఆ దంపతులు మా పూర్వీకులు," అని చెప్పింది చిలుక.

సుదర్శనుడు యీ జవాబుకు తృప్తి చెందాడు; కాని అయన పిల్లలకు తృప్తి కలగలేదు. ఆయన చిలుకకు అడిగినవన్నీ పెట్టేవాడు.



''నువ్వు ఎన్ని యిచ్చి ఏం లాభం? స్వేచ్ఛను యిస్తే ఆనందపడతాను,'' అనేది చిలుక.

''నీకు ఏదైనా యివ్వగలను కానీ, స్వేచ్ఛను యిచ్చి నిన్ను వదులుకోలేను,'' అని సుదర్శనుడు ఖచ్చితంగా చెప్పేశాడు.

ఆ తరవాత చిలుక చాలా సార్లు సుదర్శనుణ్ణి, తనకు స్వేచ్ఛను ప్రసాదించమని వేడుకున్నది. అయినా, ఒక సారి సుదర్శనుడు పంజరం తలుపు మూయడం మరిచిపోతే అది పారిపోలేదు.

ఇందుకు సుదర్శనుడు ఆశ్చర్యపడి, ''నీకు స్వేచ్ఛ కావాలని వున్నది కదా, అనుకోకుండా వచ్చిన అవకాశాన్ని ఎందుకు నీవు ఉపయోగించుకోలేదు?'' అని చిలుకను అడిగాడు.

''నేను లోగడ ఏ వంశందాన్నో చెప్పాగదా, తప్పు పనులు చెయ్యలేను. నన్ను వెయ్యి వరహాలు పెట్టి కొన్నావు. అందువల్ల, నీకు నా మీద అన్ని హక్కులూ వున్నవి. నీవు మనస్ఫూర్తిగా అనుమతించితే తప్ప యిక్కణ్ణించి వెళ్ళలేను,'' అన్నది చిలుక.

ఆనాటి నుంచీ సుదర్శనుడు పంజరం తలుపు మూయడంలో అంత శ్రద్ధ వహించేవాడు కాదు. ఒకరోజున చిలుక ఆయనతో, ''అయ్యా, నువ్వు తలుపు మూయడంలో అశ్రద్ధ చూపకు. అవకాశం వస్తూంటే, నా మనసు దుర్బలమవుతున్నది. ఏదో ఒకరోజున పారిపోయినా పోగలను,'' అన్నది.

సుదర్శనుడు, ''పారిపోవాలన్న బుద్ధి వున్నదానివి, ఆ విషయం ముందు నాతో హెచ్చరించడమెందుకు?'' అని అడిగాడు.

దానికి చిలుక, ''చాలామందికి తప్పు చేయకూడదనే వుంటుంది. అవకాశం దొరికితే మాత్రం కొంతమంది తప్పు చేయకుండా వుండలేరు. నేను విక్రమార్కుడి వంశందాన్నే కాని; విక్రమార్కుడంత గొప్పదాన్ని కాదు. తప్పు చేయడం నాకిష్టముండదు! దయచేసి నన్ను లోభ పెట్ట

వద్దు. పంజరం తలుపు జాగ్రత్తగా వెయ్యి,'' అన్నది.

ఇదంతా ఆయన, తన భార్యా బిడ్డలకు చెబితే, వాళ్ళకు చిలుక మీద మరింత అనుమానం కలిగి, ''ఇది చాలా ప్రమాద కరమైన చిలుక. దీనివల్ల మీకూ, మన కుటుంబానికీ ముప్పు రాగలదు," అన్నారు.

అందుకు తగ్గట్టే వారం తిరక్కుండా సుదర్శనుడికి ఏదో కొత్త రకం జబ్బు చేసింది. ఏ మందులకూ అది లొంగ లేదు. వైద్యుడు సుదర్శనుడితో, ''మీ వ్యాధి లక్షణాలు చూడగా, రాజగంధి అనే మూలిక ఒక్కటే, దీన్ని కుదర్చ గలదని శాస్త్రం చెబుతున్నది. కాని, యీ ప్రాంతాల ఎక్కడా, ఆ మూలిక దొరకదు. ఏ ప్రాంతాల దొరుకుతుందో, నాకు తెలియదు,'' అన్నాడు.

''నాకు స్వేచ్ఛను ప్రసాదిస్తానని మాట యిస్తే, ఆ మూలికను నేను తేగలను,'' అన్నది పంజరంలోని చిలుక.

''అసలే జబ్బుతో బాధపడుతున్నాను. నీవు లేకపోతే ఎలా ?'' అన్నాడు సుదర్శ నుడు దిగులుగా.

ఈ పరిస్థితి సుదర్శనుడి భార్యా పిల్లలకు మంచి అవకాశం కలిగించింది. వాళ్ళు ఆయనకు చిలుక కారణంగానే ఏదో భయంకర వ్యాధి దాపురించిందంటూ,



చిలుకను పంజరంలోంచి వదిలిపెట్టారు. అయితే, చిలుక సుదర్శనుణ్ణి మోసగించ లేదు. మర్నాటికల్లా అది రాజగంధి మూలికను నోట కరుచుకుని వచ్చింది.

వైద్యుడు ఆ మూలికతో వైద్యం చేయగా, సుదర్శనుడికి వ్యాధి నయ మయింది. ఆయన చిలుకతో, ''నీ మూలంగానే, నేను బతికి బయటపడ్డాను. నీవు వెళ్ళిపోతానంటే అభ్యంతరం పెట్టను. కాని, యిక్కడే వుండిపోతా నంటే చాలా సంతోషిస్తాను,'' అన్నాడు.

అందుకు చిలుక, ''చాలా కాలం తర్వాత, నా వాళ్ళందర్నీ కలుసు కున్నాను. తిరిగి వచ్చేటప్పుడు, త్వరలో



వస్తానని వాళ్ళకు చెప్పాను. నీవు, నా కోసం వెయ్యి వరహాలు ఖర్చు చేశావు. నేను, నీ ప్రాణాలనే నిలబెట్టాను. ఇంక నా స్వేచ్ఛకు అడ్డురాకు!'' అని పంజరం లోంచి ఎగిరి వెళ్ళిపోయింది.

అది పోగానే సుదర్శనుడు బెంగ పడ్డాడు. భార్యాపిల్లలు ఆయనతో, ''అది మంత్రపు చిలుక! దానికోసం విచారించి మనసు పాడుచేసుకోకండి,'' అని ఒకటికి రెండుసార్లు చెప్పడమే కాక, ఆయనకు నమ్మకం కలిగించడం కోసం పండితు లను పిలిపించారు.

వాళ్ళు, సుదర్శనుడితో, ''మాట్లాడే చిలుకలు మంత్రగాళ్ళ సాధనాలు! అది ఇంట్లో నుంచి వెళ్ళిపోవడం శుభ సూచన,'' అన్నారు.

కాలక్రమేణా సుదర్శనుడు ఆ మాటలు నమ్మాడు.

కొన్నాళ్ళ తర్వాత నిజంగానే, ఆ చిలుక తిరిగి సుదర్శనుడి వద్దకు వచ్చి, ''నా కిక్కడి జీవితం అలవాటైపోయింది. నా వాళ్ళ మధ్య, ఎంత ప్రయత్నించీ యిమడలేక పోయాను. నేను, నీతోనే వుండిపోతాను. నిన్ను వదిలి పోవాలను కున్నందుకు మన్నించు!'' అన్నది.

సుదర్శనుడు అందుకు అంగీకరించక, పంజరాన్ని పాత సామానులుండే గదిలో పారవేయించి, దాన్ని పంపేశాడు.

ఆయన పిల్లలు ఉత్సాహంగా, ''అయితే, యింతకాలానికి అది మంత్రపు చిలుక అని, నీకూ నమ్మకం కలిగిందన్న మాట! అవునా?'' అని అడిగారు.

సుదర్శనుడు ఆ ప్రశ్నకు జవాబు యివ్వకుండా, ఒకసారి కళ్ళు తుడుచు కుని పూరుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సుదర్శనుడు తన ప్రాణం కాపాడిన రామచిలుక, ఆశ్రయం కోరి తిరిగి వస్తే, ఎందుకు కాదన్నాడు? భార్యాపిల్లలలాగే అతడూ, అది మంత్రపు చిలుక అని నమ్మాడా? ఈ సందేహానికి సమాధానం

తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పండితులు అది మంత్రపు చిలుక అని చెప్పినప్పుడు, సుదర్శనుడు ఆ మాట నమ్మిన సంగతి నిజం. ధనంతోపాటు, తనపట్ల ఎంతో ప్రేమాదరాలున్న భార్యాపిల్లలున్నప్పటికీ, అతడేదో తెలియని లోటుతో అన్నివేళలా దిగులుగా వుండేవాడు. కాని, చిలుకను కొన్న తరవాత, అది తన మాటలతో, మంచి సలహాలతో అతడి దిగులును పోగొట్టింది. ఆ కారణంవల్లనే, సుదర్శనుడు చిలుక స్వేచ్ఛ కోరినప్పుడు, దానికి తానై స్వేచ్ఛ యివ్వడానికి ఒప్పుకోలేదు. చిలుక అతణ్ణి వ్యాధి నుంచి రక్షించేందుకు రాజగంధి మూలిక తెచ్చి, తిరిగి తన వాళ్ళ దగ్గిరకు పోతానని చెప్పి, యిక తన స్వేచ్ఛకు అడ్డురావద్దని సుదర్శనుణ్ణి కోరింది. దానితో అతడికి ఆత్మబంధువుల పట్ల మనిషికి వుండవలసిన ఆప్యాయతా, బాధ్యతా అర్థమైంది. కాని అదే చిలుక మరొకసారి తిరిగివచ్చి, తాను తన వాళ్ళ మధ్య జీవించలేనని చెప్పగానే, అతడికి దాని నిజరూపం తెలిసిపోయింది. అది మనిషిలాంటి చిలుక! చాలామంది మనుషులు తమ శక్తి సామర్థ్యాలతో సాధించలేనివి, గొప్పవాళ్ళ ద్వారా పొందే అవకాశం కలిగితే, తమ వాళ్ళను కూడా కాదని, వాళ్ళ పంచన చేరుతారు. అలాగే చిలుక కూడా తన తెలివితేటలను, తన వాళ్ళ కోసం ఉపయోగించాలనే బాధ్యత మరిచి, సుదర్శనుడు కల్పించే సౌఖ్యాల కోసం ఆశపడింది. ఆహార సంపాదన కోసం శ్రమపడవలసిన అవసరం, శత్రు భయం సుదర్శనుడి ఇంట దానికి లేవు. చిలుకలోని ఈ దౌర్బల్య గుణాన్ని పోగొట్టేందుకే, అతడు దానికి యిక తన యింట ఆశ్రయం యివ్వదలచలేదు." అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# లంచగొండి

శృంగేరి దేశపురాజు ఆస్థానంలో, కర్కటశాస్త్రి అనే ఒక జ్యోతిష్కుడుండేవాడు. అతడు తాను దేవీఉపాసకుణ్ణనీ, ఆమె కృపవల్ల ఏ విషయంలోనైనా నిజానిజాలు బయటపెట్టగలననీ రాజును నమ్మించాడు. ఆ కారణం చేత రాజు తన వద్దకు వచ్చిన ఫిర్యాదుల గురించి కర్కటశాస్త్రికి చెప్పేవాడు. శాస్త్రి దేవీ కృపపేరుతో, ఎక్కువ లంచం యిచ్చిన వాళ్ళకు అనుకూలంగా రాజుచేత తీర్పు లిప్పిస్తూండేవాడు.

శాస్త్రి లంచగొండి అనీ, అతడనే దేవీకృప అబద్ధం అనీ, ఆస్థానంలో పుకార్లు బయలుదేరినై. ఈ సంగతి విన్న రాజు, మంత్రిని యీ పుకార్లలో వున్న నిజమెంతో తెలుసుకోవడం ఎలా అని అడిగాడు. మంత్రి ఆయన కొక ఉపాయం చెప్పాడు.

రాజు కర్కటశాస్త్రిని పిలిచి, "మన ఆస్థానోద్యోగి శ్రీపతి, మరొకరిపై లంచగొండి అని ఫిర్యాదు చేశాడు. కొన్ని ముఖ్యమైన కారణాలవల్ల అతడి పేరు రహస్యంగా వుంచాను. శ్రీపతి ఆరోపణ ఎంతవరకు నిజమో తెలుసుకుని, రేపు సభలో బయటపెట్టండి. నిజంగా అతడు లంచగొండి అయితే కఠినంగా శిక్షిస్తాను," అన్నాడు.

ఆ రాత్రి శ్రీపతి, శాస్త్రిని కలుసుకుని, "అయ్యా, నేనొకరిపై లంచగొండి అని రాజుగారికి ఫిర్యాదు చేశాను. అది నిజం అని తేలకపోతే రాజుగారు నన్ను కఠినంగా శిక్షిస్తారు. కనక, మీరు సాయపడాలి," అని వెయ్యి వరహాలు శాస్త్రి చేతిలో పెట్టాడు.

మర్నాడు శాస్త్రి సభకుపోయి, "దేవీకృప!" అంటూ కళ్ళు మూసుకు తెరిచి, "మహారాజా, శ్రీపతి ఫిర్యాదు నిజం!" అన్నాడు.

రాజు వెంటనే భటులకు శాస్త్రిని బంధించమని ఆజ్ఞ యిచ్చాడు. శాస్త్రి వణికిపోతూ, "మహారాజా, నేనేం నేరం చేశానని బంధిస్తున్నారు?" అని అడిగాడు.

"శ్రీపతి, లంచగొండి అని ఫిర్యాదు చేసింది, నీ మీదే!" అన్నాడు రాజు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# వెర్రి వెంగళప్పలు

సీతన్నకు సీతాఫలాలంటే ఎంతో యిష్టం. ఒక రోజున వాడు వీధిలో నడుస్తూండగా, కనకయ్య ఎదురయ్యాడు. అతడు ఎక్కడినుంచో, ఆ ఊరువచ్చి నెల రోజుల క్రితమే స్థిరపడ్డాడు. కనకయ్య చేతిలో సీతాఫలం వున్నది.

సీతన్న ఆశ్చర్యంగా, "ఇది సీతాఫలాల కాలం కాదే! ఈ పండు నీ కెక్కడిది?" అని అడిగాడు.

"ఇందులో ఆశ్చర్యమేముంది? మా దొడ్లోని మామిడిచెట్టు, ఏడాది పొడుగునా అన్ని రకాల ఫలాలూ యిస్తుంది," అన్నాడు కనకయ్య.

"అదెలా సాధ్యం?" అన్నాడు సీతన్న యింకా ఆశ్చర్యంగా.

"ఎందుకు సాధ్యం కాదు? నిత్యానంద యోగి మా ఇంటికి వచ్చి, మా బావి నీటిని మంత్రించి వెళ్ళాడు. అప్పటి నుంచీ యిలా జరుగుతున్నది. చాలా మంది మా బావినీళ్ళు అడుగుతున్నారు. నేనెవ్వరికీ యివ్వడం లేదు. అందరి చెట్లూ, అన్ని ఫలాలూ యిస్తూంటే, మరి నా గొప్పతనమేముంటుంది!" అని వెళ్ళిపోయాడు కనకయ్య.

కనకయ్య ఇల్లు అక్కడికి చాలా దూరం. అయినా, వెంటనే వెళ్ళి యీ వింతేమిటో చూసి రావాలనుకున్నాడు, సీతన్న. వాడు నాలుగడుగులు వేసి, వీధి చివరకు వెళ్ళేసరికి, పక్క సందులోంచి వేగంగా వస్తున్న గోవిందం కనిపించాడు.

సీతన్న వాడితో ఏదో చెప్పబోయేలోగా వాడే సీతన్నను ముందుగా పలకరించి, "ఒరేయ్, కనకయ్య ఇంటికి రారాదూ? నీ కొక మంచి వింత చూపిస్తాను," అన్నాడు.

శ్రీ రామకమల్

"నాకూ తెలుసు. మామిడిచెట్టుకు సీతాఫలాలు కాయడమే కదా?" అన్నాడు సీతన్న.

"అదేం కాదు. వాడి దొడ్లో నాగుపాము ఒకటి, ఇంటికి వచ్చినవారందర్నీ, పడగ వంచి ఆశీర్వదిస్తున్నదట!" అన్నాడు గోవిందం.

ఇది విని సీతన్న ఆశ్చర్యపోతే, సీతన్న చెప్పిందానికి గోవిందం ఆశ్చర్యపోయాడు. అయితే కనకయ్య ఇంట్లో చాలా వింతలే వున్నాయన్న మాట! అనుకున్నారు వాళ్ళిద్దరూ.

సీతన్నా, గోవిందం కలిసి కనకయ్య ఇంటికి బయలుదేరారు. దారిలో వాళ్ళకు నాగులు అనేవాడు కనిపించాడు. వాడు వాళ్ళతో, "కనకయ్య ఇంట్లో ఒక పారిజాత వృక్షం వున్నదట. అది పగలు పడుకుని, రాత్రి లేచి నుంచుని ఇంటికి కాపలా కాస్తుందట. ఇంకా విశేషమేమిటంటే— అది ఆకు తుంచితే ఏడుస్తుందట; కితకితలు పెడితే నవ్వుతుందట!" అన్నాడు అమితమైన ఆశ్చర్యంతో.

"ఈ కనకయ్య ఎవడో మాయల మరాఠీలాగున్నాడే!" అంటూ ఆశ్చర్యపోయాడు సీతన్న.

ఈ ముగ్గురికీ దారిలో మరి కొంతమంది జతపడ్డారు. వాళ్ళల్లో ఒక్కొక్కడూ కనకయ్య ఇంటి గురించి ఒక్కొక్క వింత చెప్పాడు. కనకయ్య ఇంట్లో చీపురు దానంతటదే ఇల్లు ఊడుస్తుందని



ఒకడన్నాడు. అతడి ఇంట్లో తరగని డబ్బు యిచ్చే అక్షయపాత్ర వున్నదని మరొకడన్నాడు.

ఇలా మొత్తం పదిమందిదాకా చేరి కనకయ్య ఇంటికి వెళ్ళారు. ఆ సమయంలో కనకయ్య ఇంటి తలుపులు మూసి వున్నవి. సీతన్న పోయి తలుపు తట్టాడు. లోపలినుంచి ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు అందరికీ వినిపించింది. ఇన్ని వింతలున్న కనకయ్య ఇంట్లోని మనుషులు దేవతలా? దయ్యాలా? వాళ్ళెలా వుంటారు? అన్న ఆత్రంలో వున్నారు వాళ్ళు.

కిర్రుమంటూ తలుపులు తెరుచుకున్నవి. సుమారు పదిహేనేళ్ళ కుర్రాడు, వచ్చిన వాళ్ళను చూసి ఆశ్చర్యంగా, "ఎవరండీ, మీరు?" అని అడిగాడు.

"మీ ఇంట్లో వింతలు చూడడానికి వచ్చాం," అన్నాడు సీతన్న.

"మా ఇంట్లో వింతలేమిటి?" అన్నాడు కుర్రాడు ఆశ్చర్యపోతూ.

సీతన్న వింతల జాబితా వినిపించాడు.

"మీరే యింటికని వచ్చారో—మా యింట్లో అలాంటి వింతలేమీ లేవు," అన్నాడు కుర్రాడు.

"ఇది కనకయ్యగారిల్లేనా?" అని అడిగాడు సీతన్న.

"అవును," అన్నాడు కుర్రాడు.

"కనకయ్యగారే మాకు, ఈ వింతల గురించి చెప్పారు!" అన్నాడు సీతన్న.





"ఏమో మరి. ఆయన అలా ఎందుకు చెప్పాడోగాని, వాటిల్లో ఒక్కటీ నిజం కాదు," అని లోపలికి వెళ్ళబోయాడు కుర్రాడు.

తన ఇంట్లోని వింతలు బయటివాళ్ళకు చూపించడం ఇష్టంలేక కుర్రవాడు అలా మాట్లాడుతున్నాడనుకుని, అందరూ కలిసి ఇంట్లోకి వెళ్ళారు. ఆ కుర్రవాడు చెప్పింది నిజమే! లోపల ఏ వింతలూ లేవు. కనకయ్య దొడ్లో బావీలేదు, చెట్లు కూడా లేవు.

వచ్చిన పదిమందికీ చాలా కోపం వచ్చింది. వాళ్ళు అక్కడినుంచి దూకుడుగా, కనకయ్యను వెతుకుతూ బయలుదేరారు. దారిలో వాళ్ళకు ఒక చోట కనకయ్య కనిపించాడు.

సీతన్న అతణ్ణి కోపంగా, "నువ్వు, మా అందరికీ అన్నీ అబద్ధాలు చెప్పావు, అవునా?" అని అడిగాడు.

"అవును," అన్నాడు కనకయ్య తొణక్కుండా.

"అలా ఎందుకు చెప్పావు?" అన్నాడు సీతన్న ఉగ్రుడైపోతూ.

"కొత్తగా ఏదైనా గ్రామం వెళ్ళి నివాసం ఏర్పరచుకున్నప్పుడు, ఆ గ్రామంలో వెర్రి వెంగళప్పలెవరో, తెలివైన వాళ్ళెవరో ఎలా తెలుస్తుంది?" అన్నాడు కనకయ్య.

"అబద్ధాలు చెబితే తెలుస్తుందా?" అన్నాడు గోవిందం రెట్టిస్తున్న ధోరణిలో.

"ఎందుకు తెలియదు? నా అబద్ధాలు నమ్మిన వాళ్ళందరూ, వెర్రి వెంగళప్పలే గదా!" అని జవాబిచ్చాడు కనకయ్య.

సీతన్నా, మిగతావాళ్లూ ముఖముఖాలు చూసుకున్నారు. ఏమనాలో వాళ్ళకు తోచలేదు.

కొద్దిసేపాగి గోవిందం నెమ్మదిగా, "నీ అబద్ధాలు ఎవరెవరు నమ్మారో, నీకెలా తెలుస్తుంది?" అని అడిగాడు.

"నా అబద్ధాలు నమ్మినవాళ్ళు, మా ఇంటికి వెళతారు. మా అబ్బాయి వాళ్లను

చూస్తాడు. ఒకసారి చూసిన ముఖాల్ని వాడు మళ్ళీ మరిచిపోడు—వాణ్ణడిగి తెలుసుకుంటాను,'' అన్నాడు కనకయ్య.

"నువ్విప్పుడు ఇంటికి వెళుతున్నావా?" అన్నాడు సీతన్న.

''లేదు. ఊళ్ళో యింకా చాలా పనులున్నవి,'' అన్నాడు కనకయ్య.

సీతన్నా, అతడి వెంటవున్న వాళ్లూ, కనకయ్యకు వస్తాం అని చెప్పి, సరాసరి అతడి ఇంటికి వెళ్ళారు.

''మళ్లీ ఎందుకు వచ్చారు?'' అన్నాడు కనకయ్య కొడుకు.

''అందరం తలో వరహా యిచ్చుకుంటాం. మేము, మీ ఇంటికి వచ్చి, వింతల గురించి అడిగినట్టు, మీ నాన్నకు చెప్పకూడదు, సరేనా?'' అని అడిగాడు సీతన్న.

అలాగే చెప్పను, అని కనకయ్య కొడుకు అన్న తర్వాత, సీతన్న వాడికి పది వరహాలు యిచ్చి, మిగతా వాళ్ళతో బయలుదేరి వెళ్ళాడు.

కనకయ్య ఊరంతా తిరిగి రాత్రికి ఇల్లు చేరాడు. కనకయ్య కొడుకు, తండ్రిని చూడగానే, ''ఉదయం నుంచి, సాయంకాలం దాక వచ్చిన వాళ్ళవల్ల, మొత్తం ఐదు వందల వరహాలు వసూలైంది. నువ్వు, అప్పు చెయ్యకుండా వ్యాపారం మొదలుపెట్టవచ్చు,'' అన్నాడు సంతోషంగా నవ్వుతూ.

''అవును, వ్యాపారం కూడా ఇలాంటి ఊళ్ళోనే మంచి లాభసాటిగా సాగుతుంది. వెర్రి వెంగళప్ప అయిన వాడికంటే—తనను వెర్రి వెంగళప్ప అని ఎవరూ అనుకోకూడదనుకుంటారే—అలాంటి వాళ్ళవల్లే, మనకు లాభం ఎక్కువ. ఈ ఊళ్ళో అలాంటివాళ్ళు చాలామంది వున్నారు,'' అన్నాడు కనకయ్య ఉత్సాహంగా.

మర్నాడు కనకయ్య పాడిగేదెల్ని కొని, ఆ ఊళ్ళో పాల వ్యాపారం ప్రారంభించాడు. అతడి వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్థిల్లింది.





# జ్ఞానోదయం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తుండగా బోధిసత్త్వుడు కోసలరాజుగా జన్మించాడు. ఆయనకు సత్యసేనుడని ఒక కుమారుడుండేవాడు. యుక్తవయను రాగానే రాజు సత్యసేనుణ్ణి యువరాజుగా చేశాడు. యువరాజు భార్య శంబులాదేవి అపురూప సౌందర్యవతి.

దురదృష్టవశాత్తూ యువరాజుకు భయంకరమైన కుష్ఠు వ్యాధి వచ్చింది. ఎంతమంది వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆ వ్యాధి లొంగక అనాటికానాడు ఎక్కువ కాసాగింది. అటువంటి భయంకరమైన వ్యాధి పెట్టుకుని నలుగురి మధ్యా ఉండటానికి నామోషీవేసి, యువరాజు తండ్రి అనుమతితో, నిర్జనారణ్యంలో ఉండటానికి బయలుదేరాడు. అప్పుడు శంబులాదేవి కూడా తన భర్త వెంట వనవాసానికి బయలుదేరింది. యువరాజు వద్దని ఎన్ని విధాల చెప్పినా ఆమె ఏమాత్రం వినలేదు.

అరణ్యంలో జలసమృద్ధీ, ఫలసమృద్ధీ ఉన్న చోట యువరాజు ఒక పర్ణశాల నిర్మించుకుని అందులో ఉండసాగాడు. శంబులాదేవి ఉదయమే లేచి ఇంటి పనులన్నీ చేసి, భర్తకు పలుదోము పుల్లా, నీళ్ళూ ఇచ్చి, అతను ముఖం కడుక్కున్నాక తినటానికి పళ్ళు ఇచ్చి, తట్టా గునపమూ తీసుకుని అడవిలోకి వెళ్ళేది. పళ్ళూ కందమూలాలూ తెచ్చేది. కొలను నుంచి నీరు తెచ్చేది. భర్తచేత స్నానం చేయించేది. తరవాత భర్తకు భోజనం పెట్టి తాను భోజనం చేసేది. ఈ విధంగా ఆమె అహోరాత్రాలు భర్తను కనిపెట్టి ఉంటున్నది.

ఒకనాడామె పళ్ళకోసమని కొత్తవైపుగా బయలుదేరింది. కొంతదూరం వెళ్ళేసరి

కామె కొక కొండకోన కనిపించింది. ఆ కోనలో కోనేరు ఒకటున్నది. దాన్ని చూడ గానే ఆమెకు అందులో స్నానం చెయ్య బుద్ధి పుట్టింది. ఆమె అందులో స్నానం చేసి బయటికి వచ్చేసరికి ఆమె శరీరం మేలిమి బంగారు చాయతో ప్రకాశించ సాగింది.

ఈ సంగతి ఆమె గమనించలేదు గాని, ఆ సమయానికి అటుగా పోతున్న కిరాతు డొకడు ఆమెను చూసి నిర్ఘాంతపోయి ఆగాడు. వాడు ఆమెను తన గూడెముకు రమ్మనీ, తనను పెళ్ళాడమనీ బతి మాలాడు. ఆమె దారికి అడ్డు నిలబడి కదలనివ్వలేదు. ఇది చూసి శంబులా దేవి, ''ఓరీ, పాపాత్ముడా! నాశనమై పోతావు!'' అంటూ బిందెలో నీరు వాడి మీద చల్లింది. పిడుగుదెబ్బ తిన్నవాడల్లే వాడు పడిపోయాడు.

కిరాతుడి బెడద వదిలించుకుని నీరూ, పళ్ళూ తీసుకుని పర్ణశాలకు వచ్చే సరికి చాలా పొద్దుపోయింది. భర్త, ''ఇంత ఆలస్యమయిందేం?'' అని అడిగాడు.

శంబులాదేవి జరిగినదంతా చెప్పింది. కాని భర్త నమ్మక, ''ఆడవాళ్ళు ఎన్నయినా కల్పించగలరు! ఎక్కడ తిరిగినా నిన్ను అడిగేవాళ్ళు లేరు!'' అన్నాడు.



''స్వామీ, నేను చెప్పేది సత్యమైతే మీ వ్యాధి ఈ నీటితో నయమైపోవాలి!'' అంటూ బిందెతో తెచ్చిన నీరు భర్తకు అభిషేకం చేసింది. వెంటనే, ఇంద్రజాలం లాగా, అతని వ్యాధి తుప్పురాలినట్టు రాలి పోయి, అతని శరీరం కూడా బంగారం లాగా మెరవసాగింది. తన భార్య పాతి వ్రత్యం కంటె, తనకు వ్యాధి నయ మయిందన్న విషయం సత్యసేనుడికి ఎక్కువ ఆనందం కలిగించింది. అతను వెంటనే బయలుదేరి కోసల రాజధానీ నగరానికి వచ్చి ఉద్యానవనంలో విడిది చేసి తన రాకను గురించి తండ్రికి కబురు చేశాడు.

రాజుగారు స్వయంగా ఛత్రచామరాలతో బయలుదేరి ఉద్యానవనానికి వచ్చి తన కుమారుడికి స్వాగతం చెప్పాడు. యువరాజు వ్యాధి నయం కావటానికి గాను సహాయపడినందుకూ, అతనితో సమంగా అరణ్యవాసం చేసినందుకూ, శంబులాదేవికి పట్టపురాణీ హెూదా ఇస్తూ ఉత్తరువు చేశాడు. తాను వానప్రస్థం స్వీకరించి సత్యసేనుడికి రాజ్యాభిషేకం చేసేశాడు.

తండ్రి ఉత్తరువు ననుసరించి సత్యసేనుడు శంబులాదేవిని పట్టపురాణిగా చేసుకున్నాడే గాని, ఆమెపట్ల పూర్తిగా ఉదాసీనుడై తన ఇతర భార్యలతోనే ఎక్కువగా కాలం గడపసాగాడు. భర్త అనాదరణవల్లా, సవతుల ఈర్ష్య వల్లా శంబులాదేవి చిక్కిశల్యమై పోయింది.

ఇలా వుండగా ఒకనాడు మామగారు శంబులాదేవి ఇంటికి భోజనానికి వచ్చాడు. ఆమె స్థితికి ఆశ్చర్యపడి, "ఎందుకిట్లా కృశించిపోయావు?" అని అడిగాడు.

"భర్త ఆదరణ లేని భార్య ఇంకెట్లా ఉంటుంది?" అన్నది శంబులాదేవి.

ముసలిరాజు జరిగినదంతా విని సత్యసేనుణ్ణి పిలిపించి, "నాయనా, కృతఘ్నత కంటే మహాపాతకం ఇంకొకటి లేదు. భయంకరమైన వ్యాధితో నువు మనుష్యుల మధ్య ఉండలేక అరణ్యానికి పారిపోయినప్పుడు నీ వెంట వుండి, రాత్రింబగళ్ళు నీకు సేవచేసి, చివరకు నీ వ్యాధి కూడా నయం చేసిన భార్యను, రాజ్యం చేతికి చిక్కగానే తృణీకరిస్తావా? ఈ రాజ్యాలూ, వైభవాలూ ఎవరికైనా లభిస్తాయి. కాని పతివ్రత అయిన భార్య ఎవరో అదృష్టవంతుడికిగాని లభించదు. కనక శంబులాదేవిని అనాదరంతో చూడకు. అందువల్ల నష్టపడేది నువే!" అని బోధించాడు.

సత్యసేనుడు జ్ఞానోదయం కలిగినవాడై భార్యకు క్షమాపణ చెప్పుకుని, ఆమెకు తనపైనా తన ఇతర భార్యలపైనా అంతులేని అధికారాలిచ్చి, ఆమెను ఆదరంతో చూస్తూ కాలం గడిపాడు.






# బ్రిటిష్ పరిపాలన ప్రారంభం

పదిహేనవ శతాబ్దంనాటికి, పాశ్చాత్యులు, భారతదేశాన్ని సిరిసంపదలకు నిలయంగా కలలు గనసాగారు. ఇటలీ నావికుడైన కొలంబస్, స్పెయిన్ రాజ దంపతుల ఆదరణతో, భారతదేశానికి సముద్రమార్గం కనుగొనడానికి బయలు దేరాడు. కాని, **1498** వ సంవత్సరంలో ఆయన అమెరికాను కనుగొన్నాడు.

అదే సంవత్సరం పోర్చుగీసు నావికుడు వాస్కోడాగామా భారతదేశాన్ని చేరాడు. కళ్లికోట హైందవరాజు జమోరిన్ ఆయనకు స్వాగతం పలికాడు. ఐరోపా నుంచి భారతదేశానికి సూటి అయిన సముద్రమార్గం కనుగొన్నవాడు వాస్కోడా గామా. ఆ పిమ్మట డచ్చి, డేన్స్, ఇంగ్లీషు, ఫ్రెంచి వర్తకులు భారత దేశానికి రాసాగారు.





ఫ్రెంచి, ఇంగ్లీషు వర్తకులు భారత దేశంలో నిలదొక్కుకోగలిగారు. భారత దేశ పాలకులను వారికి వ్యతిరేకంగా సమైక్య పరచడానికి మహాత్ములు ప్రయత్నించారు. కాని అది ఫలించ లేదు. మొదట వర్తకులుగా వచ్చిన ఫ్రెంచివాళ్లూ, బ్రిటిష్‌వాళ్లూ, క్రమంగా భారతదేశాన్ని పరిపాలించడానికి ఒకరితో ఒకరు పోటీపడి పోరాడడం ప్రారంభించారు.




దక్షిణ భారతదేశంలో పుదుచ్చేరి కేంద్ర స్థానంగా డూప్లే నాయకత్వంలో, ఫ్రెంచివారు బలపడసాగారు. 1740వ సంవత్సరంలో ఐరోపాలో యుద్ధం ప్రారంభమయింది. ఫ్రాన్స్, ఇంగ్లండ్ దేశాలు బద్ధశత్రువులయ్యాయి. దాని పర్యవసానంగా, ఇంగ్లీష్, ఫ్రెంచి నౌకల మధ్య దక్షిణభారత సముద్ర తీరంలోనూ యుద్ధం జరగసాగింది.

రాబర్ట్ క్లైవ్ అనే సాహస యువకుడి కారణంగా ఆంగ్లేయులకు అదృష్టం కలిసి వచ్చింది. చాలా దుడుకు స్వభావుడైన క్లైవ్, పద్దెనిమిదో యేట ఇంటి నుంచి పారిపోయి, ఈస్టిండియా కంపెనీలో గుమాస్తాగా చేరాడు. దాని మూలంగా అతడు, ఈస్టిండియా కంపెనీ సెయింట్ జార్జికోట నిర్మించిన చెన్నపట్టణానికి వచ్చాడు.





బెంగాల్‌లో యువనవాబు సురాజుద్దౌలా, ఆంగ్లేయులను ఎదిరించాడు. తన రాజధానియైన మూర్షిదాబాదు నుంచి, ఈస్ట్ ఇండియా కంపెనీ రాజధాని కేంద్రమైన కలకత్తాను ముట్టడించి పట్టుకున్నాడు. కంపెనీ వారి విలియం కోట అతని హస్తగతమయింది.

కలకత్తా తమ అదుపునుంచి చేజారడం, భారతదేశంలోని ఆంగ్లేయుల కందరికీ విచారం కల్గించింది. రాబర్ట్ క్లైవ్, సైన్యాన్ని కలకత్తా కేసి నడిపించాడు. విలియం కోటను తన వశం చేసుకున్నాడు. సురాజుద్దౌలా యుద్ధానికి రాగానే క్లైవ్ అతనితో సంధి చేసుకున్నాడు. ఆ ఒప్పందం ప్రకారం యువ నవాబు తన రాజధానికి తిరిగి వెళ్ళాడు.





సురాజుద్దౌలా తిరిగి వెళ్ళిన వెంటనే, అతని సేనానాయకుడు మీర్జాఫర్‌కు అధికారం ఆశ చూపి, కుట్రపన్నాడు క్లైవ్. హఠాత్తుగా నవాబుతో యుద్ధం ప్రకటించాడు. కాని దుర్మార్గుడైన సేనానాయకుడు మీర్జాఫర్ అతని సైన్యాన్ని యుద్ధానికి ఆజ్ఞాపించలేదు.

నవాబు ఓడిపోయాడు. అయన్ను బంధించి ఘోరంగా చంపారు మీర్జాఫర్ భటులు. మీర్జాఫర్ నవాబు అయ్యాడు. అయినా ప్రజల నుంచి అతడు వసూలు చేసే ప్రతి దమ్మిడీనీ ఆంగ్లేయులు ఛాబట్టుకోసాగారు. ఆ విధంగా, క్లైవ్‌కు లక్షలకొద్ది రూపాయలనూ, ఈస్ట్ ఇండియా కంపెనీకి కోట్లకొద్ది రూపాయలనూ, మీర్జాఫర్ చెల్లించవలసి వచ్చింది.





మీర్జాఫర్ ప్రవర్తన సంతృప్తికరంగా లేకపోయేసరికి, ఆంగ్లేయులు, అతని అల్లుడు మీర్‌ఖాసిమ్‌ను సింహాసనంపై కూర్చోబెట్టారు. మీర్‌ఖాసిమ్ స్వతంత్ర భావాలు కలవాడు కావడంతో, ఆయన బ్రిటిష్ వారికి తల ఒగ్గలేదు. వాళ్ళ మధ్య తగాదా, 1764వ సంవత్సరంలో బక్సార్ యుద్ధంగా పరిణమించింది. మీర్‌ఖాసిమ్‌కు ఢిల్లీ మొగల్ పాలకుడైన షా ఆలమ్ సహాయం లభించింది.

యుద్ధంలో మీర్‌ఖాసిమ్ ఓడి, ఢిల్లీకి పారిపోయి, అక్కడ పేదరికంతో మరణించాడు. ఇంగ్లండుకు వెళ్ళిన క్లైవ్ మళ్ళీ క్లైవ్ ప్రభువుగా భారత దేశానికి తిరిగి వచ్చాడు. అతడు, బెంగాల్, బీహార్, ఒరిస్సా ప్రాంతాల మంచి, శిస్తు వసూలుచేసే అధికారాన్ని మొగల్ పాలకుడికి ఇవ్వడానికి సమ్మతించాడు. దాని ద్వారా క్లైవ్ అధిక ధన లాభం పొందాడు.








వీరోచిత స్వాగతాన్ని ఆశిస్తూ, క్లైవ్ ఇంగ్లండుకు తిరిగిపోయాడు. కాని, అతని లంచగొండితనం, అతడు భారత దేశంలో చేసిన ద్రోహం, చూపిన క్రౌర్యం మొదలైనవాటికి నిరసనగా, చాలామంది అతణ్ణి ద్వేషించసాగారు. దీనిని భరించలేని క్లైవ్, కత్తితో పొడుచుకుని చనిపోయాడు. అయినా భారత దేశంలో బ్రిటిష్ పాలనకు పునాది వేసినవాడు క్లైవ్.



# విశ్వాసపాత్రుడు

లోవరాజు అనే ఒక ధనికుడి ఇంట, శరభుడనే నౌకరు వుండేవాడు. వాడికి పుట్టెడు చెవుడు. లోవరాజు వాడికి ఏదైనా పని చెప్పవలసి వచ్చినప్పుడు, గట్టిగా అరిచి మరీ చెప్పవలసి వచ్చేది. ఇంత చేసినా వాడు చెప్పినదొకటైతే, మరేదో అవకతవకపని చేసుకువచ్చేవాడు.

లోవరాజు కొడుకు కామరాజుకు, శరభుడంటే గిట్టేది కాదు. అతడు అప్పుడప్పుడూ తండ్రితో, "ఆ చెవిటిమేళంతో ఏ చిన్న పని చెప్పాలన్నా గట్టిగా అరవవలసి వస్తున్నది. వాడేం మనకు ఊరికినే పని చేయడం లేదుగదా! అలాంటప్పుడు వాణ్ణి తీసేసి, మరొకణ్ణి పనిలో పెట్టుకోవడం బావుంటుంది," అనేవాడు.

లోవరాజు అందుకు ఒప్పుకోక, "చెవిటివాడైనా వాడు చాలా నమ్మకస్థుడు; విశ్వాసపాత్రుడు. ఎంతో కాలంగా మనల్నే నమ్ముకుని బతుకుతున్నాడు. అందువల్ల, వాణ్ణి పనిలోంచి తొలగించడం భావ్యం కాదు," అనేవాడు.

నిజానికి శరభుడు, కామరాజుపట్ల కూడా వినయ విధేయతలతోనే వుండేవాడు. అయినా, కామరాజుకు వాణ్ణి చూస్తేనే ఒళ్ళు మండిపోయేది. ఎలాగైనా వీలు చిక్కినప్పుడు వాణ్ణి పనిలోంచి తీసివేయాలని నిశ్చయించుకున్నాడు.

ఒకసారి లోవరాజు, భార్యా సమేతంగా తీర్థయాత్రలకు వెళుతూ, ఇంటి బాధ్యత అంతా కొడుక్కు ఒప్పచెప్పాడు. శరభుణ్ణి తొలగించడానికి అంతకన్న మంచి అవకాశం రాదనుకున్న కామరాజు, తండ్రి వెళ్ళిన మర్నాడే వాణ్ణి పనిలో నుంచి తీసేశాడు.

తన తప్పేమిటో, నౌకరీ ఎందుకు పోయిందో, శరభుడికి అర్థం కాలేదు.

యం. ఐ. కిషన్



కామరాజు పెద్ద కోపదారి మనిషన్న సంగతి వాడికి తెలుసు. ఆ కారణంగా వాడు చిన్న యజమానిని ఏమీ ప్రశ్నించకుండా ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత శరభుడు గ్రామంలో మరెక్కడైనా నౌకరీ దొరుకుతుందేమో అని ప్రయత్నించాడు. కాని, ఎవరూ వాడికి పని యివ్వకపోగా, ''ఒరే, నీకు అసలే బ్రహ్మచెముడు. దానికి తోడు దొంగబుద్ధి కూడా అలవడినట్టుంది. అందుకే కామరాజు నిన్ను పనిమాన్పించాడు,'' అనసాగారు.

నౌకరీ పోయిందానికన్న, దొంగబుద్ధి అన్న మాటలు శరభుణ్ణి చాలా బాధ పెట్టినై. కామరాజు తన మీద ఏదో దొంగతనం అంటగట్టాడని, వాడికి అర్థమైంది. ఎక్కడా స్థిరమైన పని దొరక్కపోవడంతో, వాడు రోజు వారీ కూలీనాలీ చేసుకుని బతకసాగాడు.

ఒకనాడు వాడు బారెడు పొద్దెక్కిన సమయంలో వీధిన పోతూండగా, పక్క సందులోంచి రెండు ఆంబోతు ఎద్దులు ఒకదాన్నొకటి కుమ్ముతూ, రంకెలు వేస్తూ వీధిలోకి వచ్చినై. అదే సమయంలో కామరాజు కొడుకు ఐదేళ్ళవాడు బడికి పోతూ వీధి మలుపులో వాటికి తారసపడ్డాడు.

ఆంబోతులపోరు చూసి భయంతో ఇళ్ళ అరుగులు ఎక్కిన కొందరు పిల్లవాణ్ణి చూసి, ''అయ్యో పాపం, కామరాజు కొడుకు!'' అంటూ కేకలు పెట్టారు తప్ప, ఒక్కళ్ళయినా వాణ్ణి కాపాడేందుకు అరుగులు దిగి ముందుకు రాలేదు.

కొంచెం దూరంలో వుండి యిది చూసిన శరభుడు, పరుగునపోయి ఆంబోతు కాళ్ళకింద పడనున్న కామరాజు కొడుకును భుజానికెత్తుకుని, దాపులనున్న ఇంటి వీధివాకిలి మెట్లెక్కుతూ, కాలు జారి కిందపడ్డాడు. ఆపాటుకు కామరాజు కొడుక్కేం దెబ్బలు తగలలేదు గాని, శరభుడి కాలు బెణికింది.

తన కొడుకు ప్రమాదం నుంచి బయట పడ్డాడని విన్న కామరాజు రొప్పుతూ, రోజుతూ అక్కడికి వచ్చి, బాధతో మూలుగుతున్న శరభుణ్ణీ, పక్కనే నిలబడివున్న కొడుకునూ చూశాడు. ఆంబోతులు రెండూ, ఇంకా పోట్లాడు కుంటూనే పక్క సందులోకి పరిగెత్తినై.

అక్కడ చేరిన జనం చెప్పగా, జరిగిం దేమిటో తెలుసుకున్న కామరాజు, శరభుణ్ణి భుజాలుపట్టుకు ఎత్తి, మెట్ల మీద కూర్చొబెట్టి, "ఒరే, నేచెప్పేదేమిటో నీకు వినబడదు; అయినా ఫర్వాలేదు. నీది దొంగ బుద్ధి అన్నమాట అబద్ధం, నాది కపటబుద్ధి అన్నమాట నిజం! పని లోంచి తీసేశానన్న కోపం లేకుండా, నువ్వు ప్రాణానికి తెగించి, నా కొడుకును కాపాడావు. నువ్వెంతటి విశ్వాసపాత్రు డివో, యీ క్షణంలో నాకు తెలిసింది," అని, నడవలేని శరభుణ్ణి, యిద్దరు మను షుల సాయంతో తన ఇంటికి తీసుకు పోయాడు.

వారం రోజుల తరవాత లోవరాజు తీర్థయాత్రలు ముగించుకుని, ఇంటికి తిరిగివచ్చాడు. ఇల్లు చేరుతూనే అతడి కంటబడిన దృశ్యం, లోవరాజుకు ఆనం దంతోపాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగిం చింది. కుంటుతూ నడుస్తున్న శరభుణ్ణి, కామరాజు చేయి పట్టుకుని వీధి వాకిలి కేసి తీసుకువస్తున్నాడు.

"ఏం జరిగింది? వీడికి చేయి ఆసరా యిచ్చి నడుపుతున్నావు. మనం వీడి చెవిటి తనంతోనే వేగలేకుండా వుంటే, కుంటి తనం కూడానా!" అన్నాడు లోవరాజు.

"శరభుడు చెవిటీ, కుంటీ అయితే మాత్రం, ఏం నాన్నా? వాడికి మన కుటుంబం పట్ల ఎంత విశ్వాసం!" అంటూ కామరాజు జరిగినదంతా తండ్రికి చెప్పాడు.

తన మనమడికి ప్రమాదం తప్పినం దుకూ, శరభుడంటే తన కొడుక్కున్న కోపం పోయినందుకూ లోవరాజు చాలా సంతోషించాడు.



# పిసినిగొట్టు

పిసినారి పేరయ్య చనిపోతూనే క్షణాల మీద స్వర్గద్వారం చేరాడు. ద్వారపాలకులు అతణ్ణి చూసి ఆశ్చర్యపడుతూ, "నువ్విక్కడికి రావడం వింతగా వుంది! అసలు నువ్వేం పుణ్యం చేశావని స్వర్గద్వారం దగ్గిరకు వచ్చావు?" అని అడిగారు.

పేరయ్య వాళ్ళకేసి విసుక్కుంటూ చూసి, "అప్పుడెప్పుడో గోదావరి పుష్కరాల్లో, దారిలో దొరికిన దమ్మిడీ ఒకటి, ఒక పేద ముసలమ్మకు ధర్మం చేశాగదా! ఆ పుణ్యం తాలూకు వివరాలు, మీ చిత్రగుప్తుల వారి చిఠాలో వుంటవి. వెళ్ళి చూడండి," అన్నాడు.

ద్వారపాలకులు పేరయ్యను వెంటబెట్టుకుని చిత్రగుప్తుడి దగ్గిరకుపోయి సంగతి చెప్పారు. చిత్రగుప్తుడు, పేరయ్యతో, "ఆ దొరికిన దమ్మిడీ తాలూకూ పుణ్యం వల్లనే, నువ్వు యీ కొద్ది క్షణాలైనా యిక్కడ వుండగలిగావు. ఇక, నువ్వు నరకానికి పోక తప్పదు," అన్నాడు కటువుగా.

పేరయ్య ఏమాత్రం భయపడకుండా, "అంత నరకానికి పోకతప్పనప్పుడు, ఆ దమ్మిడీ మీ దగ్గిరపడి మూల్గుతూండడం ఎందుకు?" అని, చిత్రగుప్తుడి నుంచి దమ్మిడీ వసూలు చేసుకుని, నరకంకేసి బయలుదేరాడు.

—ఎం. డి. సౌజన్య





# సౌకుమారి!

విదేహదేశపు రాకుమారి వజ్రప్రభ ఒక నాడు తన చెలికత్తెలతో ఉద్యానవనంలో ఆటలాడుతూ, ఉన్నట్టుండి అలసిపోయా నంటూ అంతఃపురానికి తిరిగివచ్చింది. చెలికత్తెలు కంగారుపడిపోతూ, ఆమెకు సపర్యలు చేయసాగారు.

హంసతూలికా తల్పం మీద విశ్రమించి వున్న వజ్రప్రభ, తనకు సేవలు చేస్తున్న ముగ్గురు చెలికత్తెల కేసి చిరునవ్వుతో చూసి, "నేనింతగా అలసిపోవడానికి కారణం ఏమిటో, మీలో ఎవరైనా సరిగా చెప్పగలిగితే, వాళ్ళకు నా రత్నాల హారం యిస్తాను," అన్నది.

"ఒకవేళ సరైన కారణం చెప్పలేక పోతేనో!" అన్నది మరీచిక అనే చెలికత్తె.

"అప్పుడు రత్నాలహారానికి బదులు రెండు చెంపలూ వాయిస్తాను," అన్నది వజ్రప్రభ.

"అయితే, నా అదృష్టాన్ని పరీక్షించు కుంటాను," అని మరీచిక రాకుమారితో, "యువరాణిగారు అంతగా అలసిపోవ డానికి కారణం, ఉద్యానవనంలో ప్రవేశిస్తూనే దాగుడుమూతలాట మొదలు పెట్టడం. సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చినా, ఆట అలాగే కొనసాగించారు. ఉద్యానమంతా అలా పరిగెడితే అలసట రాదా మరి? తమరు గనక అంత శ్రమకు తట్టుకోగలిగారు మరొకళ్ళయితేనా!" అన్నది.

వెంటనే వజ్రప్రభ మరీచిక చెంపల్ని ఛెళ్ళుమని పించింది. మిగిలిన యిద్దరు చెలికత్తెలూ నవ్వసాగారు.

కొంచెం ఆగి మరుద్వతి అనే రెండో చెలికత్తె, "యువరాణిగారు అంతగా అలసిపోయారంటే, అందుకు కారణం సరస్సులో గంటల తరబడి యీతలు

కమలిని



మందాకిని మాట ముగించేలోపలే వజ్రప్రభ సంతోషంగా శయ్యమీదినుంచి లేచి, తన మెడలోని రత్నాలహారాన్ని చెలికత్తె మెడలో వేసింది. ఇది చూసి తతిమ్మా యిద్దరికీ ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

ఆ తరవాత కొంత సేపటికి వజ్రప్రభ నిద్రపోగానే, మరీచికా, మరుద్వతీ— మందాకినిని అంతఃపురంలోని ఒక మూరు మూల గదికి లాక్కుపోయి, "ఏమే, మందాకినీ! మన రాకుమారి రూపురేఖా విలాసాలెటువంటివో, నీకు తెలియనివి కాదుగదా? స్థూలంగా వున్నా, మోటుగా కనిపించని వాళ్ళను మనం ఎరుగుదుం కాని, రాకుమారి స్థూలమే కాదు, కాస్త మోటుగా కూడా వుంటుందని లోగడ నువ్వే అన్నావు, అవునా?" అని అడిగారు.

"ఆ మాట నిజమే!" అన్నది మందాకిని.

"మరి అటువంటి యువరాణి దోసెడు పువ్వులు కోసీ అలసిపోతుందా? ఆమె అంత సుకుమారా? ఆమె ప్రాపకం కోసం ముందు, ముందు నువ్వు ఎన్ని అబద్ధాలయినా ఆడగలవు," అంటూ చెలికత్తెలిద్దరూ మందాకినిని దెప్పిపొడవ సాగారు.

మందాకిని ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, చిన్నగా నవ్వుతూ,

కొట్టడం. అంత శ్రమకు మగవాళ్ళయినా తట్టుకోలేరు!" అన్నది.

వజ్రప్రభ చాలా కోపంగా చెలికత్తె చెంపల మీద కొట్టింది. కొంత సేపయ్యాక మందాకిని అనే మూడో చెలికత్తె, "యువరాణిగారు ఇంతలోనే అంతగా అలసిపోయిన కారణం, నా ఒక్కదానికే తెలుసు. పూల చెట్లనుంచి స్వయంగా ఒక మాలకు సరిపడేలా దోసెడు పువ్వులు కోశారు. వాటిని మాలకట్టి తెమ్మని, నాకిచ్చేప్పుడే ఆమె అలసిపోయిందని నేను గుర్తించాను. మీరిద్దరూ గమనించలేదు," అన్నది, మిగతా యిద్దరు చెలికత్తెల కేసి చిరుకోపంగా చూస్తూ.

"నేనాడినవేం అబద్ధాలు కావు; ఇతర్ల మనస్సు నొప్పించని మంచి మాటలు. సాధారణంగా రాకుమార్తెలు లావణ్యవతులుగా, కుసుమకోమలులుగా వుంటారని అందరూ అనుకుంటారు గదా? కాని మన రాకుమార్తె అందుకు పూర్తిగా భిన్నం. ఆ సంగతి ఆమెకు బాగా తెలుసు. అందుకే ఆమె, తన రూపాన్ని ఎవరైనా సూచనప్రాయంగా గుర్తు చేసినా సహించదు," అన్నది.

"అంటే, యింతకు ముందు మేమామెతో, ఆమె స్థూలకాయురాలనీ, మోటుగా వుంటుందనీ అన్నామంటావా?" అని అడిగారు చెలికత్తెలిద్దరూ కోపంగా.

"అంత కోపం ఎందుకు, నే చెప్పేది వినండి!" అంటూ మందాకిని యిలా అన్నది: "రాకుమారి అంత ఎండలో ఉద్యానవనమంతా పరిగెత్తుతూ దాగుడుమూతలాడిందని, మీరన్నారు. అంతేకాక, సరస్సులో గంటల తరబడి యీతలు కొట్టడం సంగతి తెచ్చి, అది మగవాళ్ళకూ్కడా సాధ్యపడదని చెప్పారు. ఇందువల్ల ఆమెకు, మీరు తన స్థూలకాయాన్నీ, మోటుతనాన్నీ గుర్తుచేస్తున్నారన్న కోపం వచ్చింది. నేను ఆమె మనసులోని బాధ గుర్తించినదాన్ని కనక, దోసెడు పువ్వులు కోసి అలసిపోయారన్నాను. ఆ మాటలు ఆమెకు తృప్తి కలిగించినై. మనుషుల స్వభావాలు అర్థం చేసుకుని, మాట్లాడగలిగే ఇంగితజ్ఞానం లేకనే మీరు, బహుమానానికి బదులు చెంపదెబ్బలు తిన్నారు. మీరు మంచి స్నేహితురాండ్రు కనక, రత్నహారం ముగ్గురం పంచుకుందాం."

మందాకిని చెప్పింది విని తృప్తిపడిన మరీచికా, మరుద్వతీ, "రాకుమారి వజ్రప్రభలాంటి వాళ్ళదగ్గిర ఎలా ప్రవర్తించాలో, నువ్వు చెప్పిన తర్వాత మా కర్థమైంది. ఇది ముందు, ముందు మా కెంతో మేలు గలిగించే సంగతి. ఆ రత్నహారంలో మాకు వాటా అవసరం లేదు, నువ్వే వుంచుకో!" అని, మందాకినిని మనసారా అభినందించారు.





# దాన రహస్యం

ఒక వూళ్ళో ఒక దాసుగారుండేవాడు. ఆయన ఊరూరూ తిరిగి, హరికథలు చెప్పి, శ్రోతలు తమ శక్తికొద్దీ ఇచ్చే డబ్బులతో, కానుకలతో జీవయాత్ర సాగిస్తూండేవాడు.

ఒకసారి దాసుగారు ఒక గ్రామానికి వెళ్ళాడు. ఆ వూరివాళ్ళు ఆయన చేత హరికథ చెప్పించాలని నిశ్చయించారు. అందుకు తగిన స్థలం శేషయ్య అనే పెద్ద షావుకారు ఇంట మాత్రమే ఉన్నది. అందుచేత గ్రామ ప్రముఖులు దాసుగారిని శేషయ్యగారి ఇంటికి తీసుకుపోయి, "వీరి చేత హరికథ చెప్పించాలని నిర్ణయించాం. అది మీ యింట జరిపిస్తేనే బాగుంటుంది. దాసుగారికి మనమంతా మన, మన ఉత్సాహశక్తుల ననుసరించి తలా కాస్త ముట్టజెప్పి గౌరవిద్దాం. ఏమంటారు?" అన్నారు.

శేషయ్య నిజానికి రసికుడు కాడు. కాని ఊళ్ళో ఉండే పెద్దలంతా తన గౌరవం నిలబెట్టడం ఆయనకు చాలా సంతోషం. అందుచేత ఆయన, "అయ్యో, అంతకంటేనా? తప్పక మా యింటనే హరికథ ఏర్పాటు చేద్దాం," అన్నాడు. అంతేకాక, దాసుగారి బస కూడా తన ఇంటనే అని ఆయన పట్టుబట్టాడు.

ఆ రాత్రే పెద్ద షావుకారు గారింటి ముందు గల విశాలమైన ఆవరణలో హరికథ ఏర్పాటయింది. దేవుడి పటం దగ్గిర ఒక పెద్ద పళ్ళెం పెట్టారు. హరికథ వినటానికి వచ్చినవాళ్ళు తమ శక్తికొద్దీ దాసుగారికి ఇవ్వదలచినది అందులో వెయ్యవచ్చు. కొందరు ముందే తామివ్వ దలచినది పళ్ళెంలో వేశారు. కొందరు మటుకు చివరకు వేద్దామని ఆగారు. శేషయ్య దాసుగారికి ఇవ్వటానికి ఒక

శాలువా నూరు రూపాయల సంచీ వసారా గదిలో పెట్టి ఉంచి, కథ ముగిసినాక ఇద్దామనుకున్నాడు.

ఆ వూళ్ళో చలమయ్య అనే చిన్న షావుకా రొకడున్నాడు. ఆయన వస్తూనే దాసుగారి మెడకు మూడు రూపాయలు ఖరీదు చేసే పట్టు కండువా వేసి, పళ్ళెంలో నాలుగు రూపాయలు వేసి ముందు వరసలో కూర్చున్నాడు. ఈ హరి కథే తన అధ్వర్యాన జరిపించినట్టయితే ఆయన దాసుగారిని ఇంకాస్త ఘనంగా సత్కరించేవాడే.

పెద్ద షావుకారు శేషయ్య, ఎవరెంతెంత ఇచ్చేదీ ఒక కంట కనిపెడుతూనే వున్నాడు. అన్నిటిలోకీ పెద్ద పద్దు చలమయ్యదే. అది కూడా పది రూపాయల లోపుదే. అలాటప్పుడు, తాను మట్టుకు దాసుగారికి నూరు రూపాయల నగదూ, ఒక శాలువా ఇచ్చుకోవటం దేనికీ? ఓ పది రూపాయల రొక్కమూ, ఒక జత పంచెలూ ఇస్తే సరిపోతుంది.

దాసుగారు హరికథ ప్రారంభించి చెప్పుకుపోతున్నాడు. మధ్యలో శేషయ్య ఏదో పని పడ్డట్టుగా లేచి వసారా గదిలోకి వెళ్ళి, తాను సిద్ధంగా ఉంచిన శాలువా, రూపాయల సంచీ తీసేసి, వాటికి బదులు ఒక ధోవతుల చాపూ, పది రూపాయలూ ఉంచి వచ్చాడు.

దాసుగారు శేషయ్యగారిని మొదటి నుంచీ కూడా మహా శ్రద్ధగా గమనిస్తూ,



ఆయన మనసులో కలిగే ఆలోచనలన్నీ ముఖంలో కనిపెట్టుతూ, శేషయ్య లోపలికి ఎందుకు వెళ్ళినదీ, ఏమి చేసినదీ పసి కట్టేశాడు. శేషయ్య తిరిగి వచ్చి కూచో గానే ఆయన ఒక పిట్టకథ చెప్పాడు:

కర్ణుడు మహాదాత. అడిగినవాడికి లేదని ఎరగడు. ఒకనాడు కర్ణుడు అభ్యంగనానికి సిద్ధమవుతూండగా ఆయ నను యాచించటానికి ఎవరో బ్రాహ్మడు వచ్చాడని పరిచారకులు చెప్పారు. ఆ బ్రాహ్మణ్ణి తన వద్దకు తీసుకురమ్మన్నాడు కర్ణుడు.

ఆ బ్రాహ్మడు వచ్చేసరికి కర్ణుడు ఎడమచేత బంగారు పాత్రలో నూనె పట్టు కుని, కుడిచేత్తో వంటికి నూనె రాసుకుం టున్నాడు.

"మహారాజా, పేదవాణ్ణి. తమకు తోచి నది ఇప్పించండి," అన్నాడు బ్రాహ్మడు.

మహాదాత అయిన కర్ణుడు తన ఎడమ చేత ఉన్న బంగారు గిన్నెను అలాగే బ్రాహ్మడికి ఇచ్చేశాడు.

బ్రాహ్మడు దాన్ని సంతోషంతో స్వీక రించి, "మహాదాతవు! కాని ఎడమచేత్తో ఎవరైనా దానమిస్తారా? అలా ఇవ్వటంలో గల రహస్యమేమిటి?" అని అడిగాడు.

దానికి కర్ణుడు చిరునవ్వు నవ్వి, "ఇదే, దానం ఇచ్చేటప్పుడు అందరూ పాటించ వలసిన రహస్యం. చెయ్య దలచిన దానాన్ని జాప్యం లేకుండా చెయ్యాలి. మాటవరసకు, నేను నీకీ గిన్నెను ఇవ్వా లనుకున్న క్షణంలో అది నా ఎడమచేత ఉన్నది. దాన్ని కుడిచేతికి మార్చుకునే లోపల నా బుద్ధి మారిపోవచ్చు. అందు చేత ఎడమచేతిలో ఉన్న వస్తువును, ఎడమచేత్తోనే ఇచ్చాను," అన్నాడు.

ఈ పిట్టకథ చెప్పి, హరిదాసుగారు అసలు కథకు వచ్చారు. కాని శేషయ్యకు ఆ పిట్టకథ చెంపదెబ్బలాగా తగిలింది. హరికథ పూర్తి అయాక ఆయన దాసు గారికి, తాను ముందుగా ఇవ్వాలనుకున్న కానుకలకన్నా కూడా ఘనంగా ఇచ్చి, గౌరవించి పంపాడు.





# గుణపాఠం

చంద్రవరం అనే గ్రామంలో, సూర్యదేవుడనే యువకుడుండేవాడు. అతడికి పక్కగ్రామంలోని కలవారి కుటుంబపు అంబికతో వివాహం జరిగింది.

ఒకసారి ముకుందుడనే అతడి మిత్రుడు, నగరం నుంచి భార్యతో సహా అతణ్ణి చూడ వచ్చాడు.

ముకుందుడి భార్య గౌరి చక్కగా పాడగలదు. ఆమె పాట విని సూర్యదేవుడితోపాటు అంబిక కూడా చాలా ఆనందించింది.

ముకుందుడు వారం రోజులపాటు అతిథిగా వుండి నగరం వెళ్ళిపోయాక సూర్యదేవుడు భార్యతో, "అంబికా, నువ్వు కూడా గౌరిలా చక్కగా పాడటం అలవాటు చేసుకోరాదా!" అన్నాడు.

భర్త యిలా అనడం అంబికకు చాలా ఆశ్చర్యం కలిగించింది. గానం, చిత్రకళ, కవిత్వాల్లాంటివి వయసుతో ప్రమేయం లేకుండా, ఎప్పుడు పడితే అప్పుడు సాధించగలిగినవా? గౌరి తన ఆరవయేట గురువువద్ద సంగీత సాధన చేసినట్టు చెప్పింది.

అంబిక భర్తతో, "నా కంఠస్వరం బావుండదండీ, నేనేం పాడలను," అన్నది.

ఈ జవాబుతో భర్త ఇక ఈ పాట ప్రసక్తి తేడని ఆమె అనుకున్నది. కాని, సూర్యదేవుడు కొంచెం చిరాకుగా, "కంఠస్వరానిదేమున్నది! పాడగా, పాడగా రాగం పట్టుబడుతుందన్నారు, పెద్దలు. ప్రయత్నించి చూడు," అన్నాడు.

కొంతకాలం గడిచాక ఓంకారశర్మ అనే చిత్రకారుడు గ్రామంలో ఒక చిత్రకళాప్రదర్శన ఏర్పాటు చేశాడు. అతడు వేసిన చిత్రాలన్నీ పూర్తిగా గ్రామవాతావరణానికి సంబంధించినవి.

ఎస్. వి ఆర్. సత్యనారాయణమూర్తి

ఆ ప్రదర్శన చూసి ఇంటికి తిరిగి వచ్చాక అంబిక భర్తతో, ''ఏమండీ, ఓంకారశర్మ వేసిన చిత్రాలు ఎంత జీవకళ ఉట్టిపడుతున్నవో గమనించారా? మీరు కూడా అలాంటి చిత్రాలు వేస్తే చూడాలని వున్నది,'' అన్నది.

ఆ మాటలకు సూర్యదేవుడు ఆశ్చర్య పోతూ, ''నేను చిత్రాలు వేయడమా? చిత్రకళ అంటే, నీకంత చులకనగా కనబడుతున్నదా?'' అన్నాడు.

''చిత్రాలు వేయడం చులకన అని, నేననడం లేదు, ప్రయత్నించి చూడండి! అయినా పట్టుదలగా అలా గీస్తూ పోతే, మంచి చిత్రాలు రాకపోవు. అభ్యాసం కూసువిద్య అన్నారు గదా, పెద్దలు,'' అన్నది అంబిక.

ఆ మరుక్షణం సూర్యదేవుడికి పాట విషయంలో, తాను భార్యకు యిచ్చిన సలహా గుర్తుకు వచ్చింది. అతడు ఆమెతో, ''ఆనాడు, నా మిత్రుడి భార్య గౌరి పాట విన్న ఆనందంలో, నీకు అర్థం లేని సలహా ఒకటియిచ్చాను. అది పెద్ద పొరబాటు. లలితకళలలో ప్రావీణ్యం సంపాయించడం, అందరికీ సాధ్యమయే పనికాదు. ఒక వేళ అలాంటిది సాధించ దలిస్తే, చిన్నప్పటినుంచీ తగిన గురువును ఆశ్రయించాలి, అయినప్పటికీ తాను నేర్వ దలచిన కళల పట్ల స్వభావసిద్ధమైన కౌశల్యం లేకపోతే అది రాణింపుకు రాదు,'' అన్నాడు.

''అలా చెప్పండి! మనం చిన్నతనంలో ఆ పని చేయలేకపోయాం. మరి యిప్పుడేం చేసేట్టు?'' అన్నది అంబిక ముఖం మీద లేని విచారాన్ని కనబరుస్తూ.

''మనం యిప్పుడు చేయవలసిందేమిటంటే, ఆ యా కళల్లో ప్రతిభావంతులైన వాళ్ళను గౌరవించడం; వాళ్ళ పాటనూ, చిత్రాలనూ చూసి ఆనందించడం,'' అన్నాడు సూర్యదేవుడు.

భర్త లలితకళలను గురించిన వాస్తవాన్ని అర్థం చేసుకున్నందుకు అంబిక చాలా సంతోషించింది.





# విభీషణ కథ

విభీషణుడిలాగే రావణుడి పట్టమహిషి మండోదరి కూడా భర్తకు హితవు చెప్పింది. ''నాథా! ముక్కు చెవులు కోసినందుకో, వరించమంటే వరించనందుకో, నీ చెల్లెలు అవమానం భరించలేకపోయినప్పుడు, ఒంటరిదాన్ని, అసహాయురాల్ని, బంగారాన్నో, పశువునో, పక్షినోలాగ ఎత్తుకు వచ్చినందుకు, సీత ఎంత బాధపడుతుందో ఊహించావా? శూర్పణఖ ప్రతీకారంతో సీతను ఎత్తుకు రమ్మన్నట్లే, సీతకు జరిగిన అవమానానికి ఆమెకు యింకెంత కసి ఉంటుందో ఆలోచించు!'' అన్నది.

రావణుడు, ''ఔను మండోదరీ, ఇప్పుడు తెలుస్తున్నదిగానీ, కానీ— ఏమైనా కానీ, రావణుడు తల వంచడం అనేది లేదు! నీ భర్త భీరువుకాడు. పిరికి మందు నూరి పోయకు! ఆ రాముడు ఏం చేయగలడో నేనూ చూస్తాను,'' అన్నాడు.

ఎక్కడెక్కడి వనాల్లోని వానరులంతా చేరుకొని రాముడి సేనగా తయారయ్యారు. సుగ్రీవుడు, నీలుడు, అంగదుడు, సుషేణుడు, జాంబవంతుడు మొదలైన ప్రముఖులంతా సేనానాయకులై రాముడికి అండదండలుగా నిల్చారు. హనుమంతుడు రాముడి కార్యకర్తగా, అంగరక్షకుడిగా లంకపై దాడికి సర్వసన్నాహాలు ప్రారంభమయ్యాయి.

హనుమంతుడు పర్వతాలు, కొండలు తెచ్చి సముద్రంలో వేశాడు.

14. రావణ సంహారం



వానరులు పెద్ద బండలు, శిలలు తెస్తున్నారు. చిన్న కోతులు రాళ్ళు మోసుకొస్తున్నారు.

నూరు యోజనాల పొడవునా లంకకు సముద్రం మీద సేతు నిర్మాణం అతి వేగంగా ఎంతో ఉత్సాహంతో ప్రారంభమైంది. నీలుడు సేతు నిర్మాణపర్యవేక్షణా బాధ్యత తీసుకున్నాడు.

విభీషణుడు ఆకాశమార్గాన రాముడి శరణాగతుడై వచ్చాడు. రాముడతనికి అభయమిచ్చి లంకకు రాజును చేస్తానని చెప్పాడు. అప్పటికప్పుడు సముద్ర జలాలతో అతణ్ణి లంకకు రాజుగా అభిషేకించాడు.

రాముడు వారధి కట్టించి, కోదండాన్ని, రామబాణాన్ని రెండు చేతులతో పట్టుకొని, వానరసేనలు వెంటరాగా, ఇరు పక్కల లక్ష్మణుడు, హనుమంతుడు నడుస్తుండగా, లంకను ముట్టడించడానికి బయలుదేరాడు. విభీషణుడు వారిని అనుసరించాడు.

వేగులు రాముడు వానరసేనలతో సముద్రం దాటి వస్తున్నవార్త తెచ్చారు. రావణుడు చకితుడయ్యాడు. ఒక నరుడు వానరులను కూడగట్టుకొని, సముద్రం మీద నూరు యోజనాల పొడవు వంతెన కట్టి, ముల్లోకాలను గడగడలాడించే రావణాసురు డంతటివాడిని కొట్టి తన సొత్తయిన భార్యను తెచ్చుకున్నాడు అని అనిపించుకోవడమే! ఏమిటిది? ఇది జరుగుతుందా? కట్టడం మాత్రమే జరిగినంత మాత్రాన మిగతా రెండూ జరుగుతాయని భయపడ్డం దేనికి? అని అనుకుంటూన్న రావణుడితో, మంత్రి ప్రహస్తుడు, "శత్రువును దారిలోనే ఎదుర్కొని తుద ముట్టించడం మంచిది!" అన్నాడు.

రావణుడు నవ్వి, "మన కుంభకర్ణుడికి తగినంత ఆహారం దొరకడం లేదు. వాళ్ళు లంకకు రానీ! సాలెగూటిలో చిక్కుకున్న ఈగల్లాగ, నా తమ్ముడి ఆకలికి పనికొస్తారు!" అన్నాడు.

రాముడు వానరసేనలతో వారధిని దాటి లంకా తీరాన్ని చేరాడు.

లంకానగరం ఎత్తయిన పర్వతం చివరంటా నిర్మించబడింది. పర్వతాగ్రం మీది సౌధంలో రావణుడు ఉంటాడు.

ఆ సౌధాగ్రం నుంచి రావణుడు రాముడు విడిసిన తీరాన్ని చూశాడు. తీరం పొడవునా చీమలబారుల్లాగ వానరసేనలు వ్యూహాలు పన్నుతున్నారు.

అంగదుడికి వీరావేశం వచ్చింది. రివ్వున ఎగిరి వెళ్ళి రావణాసురుడి సౌధం మీద వాలాడు.

"ఓ, రావణా! ఒకప్పుడు నిన్ను తోకతో చుట్టి విసిరేసిన వాలి కుమారుణ్ణి నేను, అంగదుణ్ణి! అప్పటి నుంచి నువ్వు, మా తండ్రిపట్ల గౌరవమర్యాదలతో మిత్రుడిగా ఉన్నావు గనుక, చెబుతున్నాను. ఇప్పటికైనా మించిపోయింది లేదు. రాముడితో వైరం మాను. శరణు వేడు. వానరమూకతో రాముడేం చేయగలడన్న ధీమాతో వుండకు. వానరులెంతటివారో నీకు మళ్లీ చెప్పనవసరం లేదు!" అన్నాడు.

రావణుడికి కోపం వచ్చి కత్తి ఎత్తాడు. అంగదుడు రావణుడి కిరీటాన్ని కాలితో తన్ని పడద్రోసి, తిరిగి వానరసైన్యం వున్న చోటుకు ఎగిరి వెళ్ళాడు



వానరసేన విజృంభించి లంకా నగరాన్ని ముట్టడించి చికాకు పరుస్తూంటే, రావణుడు కుంభకర్ణుడి నిద్ర చెడగొట్టించి, అతణ్ణి వెంటనే యుద్ధానికి వెళ్ళమన్నాడు.

కుంభకర్ణుడు ఘోరమైన తపస్సు చేసినప్పుడు బ్రహ్మ సరస్వతి చేత అతని కోరికలు తారుమారు చేయించాడు. ఆరు నెలలు తిండి, ఒకరోజు నిద్ర కోరుకోవాలనుకున్న కుంభకర్ణుడు, ఆరు నెలల నిద్ర, ఒకరోజు తిండి కోరుకున్నాడు. బ్రహ్మ అతడికి అలాగే వరమిచ్చాడు.

ఆరు నెలల నిద్ర పూర్తిగా తీరకపోతే, కుంభకర్ణుడి శక్తి తగ్గిపోతుంది. అతడు



రావణుడు చేసిన పనికి విసుక్కున్నాడు, అన్నకు వినయంగా హితబోధ కూడా చేశాడు.

రావణుడు, "చేస్తే యుద్ధం చెయ్యి, లేదా వెళ్ళి పడుకో!" అన్నాడు.

నిద్ర చెడిన కోపంతో కుంభకర్ణుడు వానరులను పట్టుకు తినసాగాడు. రామ లక్ష్మణులు నిర్విరామంగా యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో రాముడు కుంభ కర్ణుడిని సంహరించాడు.

ఆ తరవాత యోధాన యోధులైన రాక్షస ప్రముఖులందరూ కూలిపోయారు. రావణుడి పెద్దకొడుకు ఇంద్రజిత్తు యుద్ధానికొచ్చాడు.

రావణుడు అతని మీద పెద్ద ఆశ పెట్టుకొని ఉన్నాడు. మేఘాల్లోంచి యుద్ధం చేసే వాడవడంవల్ల మేఘనాథుడు అని పేరొంది, ఇంద్రుణ్ణి జయించి కట్టి తెచ్చి, ఇంద్రజిత్తు అనిపించుకొన్న మహావీరుడు. మంత్రతంత్రాలు నేర్చిన ఇంద్రజిత్తు జిత్తులమారి, మహామాయావి. పద్నాలు గేళ్ళు బ్రహ్మచర్యంతో నిద్రాహారాలు లేకుండా కఠోరదీక్ష గడిపిన వాడివల్లనే గాని, మరెవ్వరివల్లా అతనికి ప్రాణ భయంలేదు.

ఇంద్రజిత్తు మాయ సీతను కల్పించి, రాముడికి కనిపించేలాగ ముక్క ముక్కలుగా నరికాడు.

లక్ష్మణుడు అది అంతా మాయాజాల మని అన్నకు ధైర్యం చెప్పి గొప్పగా యుద్ధం చేశాడు.

అలాగే రావణుడు విద్యుజ్జిహ్వు డనే వాడి చేత రాముడి తలను తయారు చేయించి, శూలానికి గుచ్చి సీతకు చూప మని పంపాడు.

దానిని చూసిన సీత, "ఇలాంటి చేతి పనివి కాకుండా, రావణుడి అసలు తలలు తెగి నేల దొర్లేరోజు వచ్చిందిలే," అని చెప్పింది.

ఇంద్రజిత్తు మేఘాల్లో దాగి రామలక్ష్మ ణులపై నాగాస్త్రాన్ని వేశాడు. గరు

త్మంతుడు నాగులను నిర్మూలించి రామలక్ష్మణులను పాముల వల నుండి తప్పించాడు.

సీతారాముల సేవలో పద్నాలుగేళ్ళు కఠోరదీక్ష గడిపిన లక్ష్మణుడి చేతిలో ఇంద్రజిత్తు చావు రాసి ఉందని విభీషణుడు చెప్పాడు.

లక్ష్మణుడూ, విభీషణ, హనుమంతులూ వెళ్ళి నల్లటి మేకపోతులను బలిచేస్తూ, ఇంద్రజిత్తు చేస్తున్న హోమాన్ని ధ్వంసం చేశారు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించాడు.



రావణుడు పాతాళ లంకాధిపతియైన మైరావణుడిని రామలక్ష్మణులను కాళికి బలి వేయమన్నాడు.

నిద్రిస్తున్న రామలక్ష్మణులను మైరావణుడు తన మాయాజాలంతో ప్రతిమల్ని చేసి, పాతాళ లంకకు ఎత్తుకుపోయి, కాళికాలయంలో బలికి సిద్ధంగా ఉంచాడు.

హనుమంతుడు పాతాళ లంక చేరి, ద్వారపాలకుడుగా ఉన్న మత్స్యవల్లభుడితో పోరాడుతూండగా, సువర్చలాదేవి వారిద్దరూ తండ్రీ కొడుకులౌతారని చెప్పి పోరు మాన్పించింది.

హనుమంతుడు సూక్ష్మరూపంతో కాళికాలయం ప్రవేశించి, రామలక్ష్మణులను భుజాల మీద ఎక్కించుకొని యివతలకు తెచ్చాడు. రామలక్ష్మణులు మైరావణుడితో యుద్ధం చేశారు.

రాముణ్ణి తన దైవంగా ఆరాధించే చంద్రసేనను మైరావణుడు చెరతెచ్చాడు. ఆమెవల్ల హనుమంతుడు మైరావణుడి ప్రాణరహస్యాన్ని తెలుసుకొని దాన్ని ధ్వంసం చేశాడు. మైరావణుడిని రాముడు హతమార్చాడు.

రాముడు చంద్రసేనకు ఆత్మతత్వాన్ని బోధించి, మరుజన్మలో విష్ణువును పొందగలవని ఆశీర్వదించాడు.

పాతాళలంకకు మత్స్యవల్లభుడిని అధిపతిని చేసి, హనుమంతుడు రామలక్ష్మణు



లను భుజాల మీద మోసుకొని లంకకు వచ్చాడు.

మాయోపాయాలన్నీ విఫలం కాగా, రావణుడు ఉక్కు యోధుల్నీ, చతురంగ బలాల్నీ పుట్టించే పాతాళ లంకా యాగాన్ని ప్రారంభించాడు. విభీషణుడు ఆ రహస్యాన్ని తెలుసుకొని దాన్ని భంగపుచ్చే ఉపాయం చెప్పాడు.

అంగదుడు అదృశ్యకరణి విద్యా ప్రభావంతో వెళ్ళి మండోదరి జుట్టుపట్టి రావణుడి ఎదుటికి యీడ్చుకెళ్లాడు. రావణుడి దీక్షభగ్నమై యాగధ్వంసం అయింది.

రావణుడు హతాశుడై చివరకు యుద్ధానికి బయలుదేరాడు. అప్పుడు కూడ మండోదరి సీతను రాముడికి అప్పగించమని భర్తకు హితవు చెప్పింది.

"రావణుడు రావణుడే!" అని సింహగర్జన చేసి పది గుర్రాలు పూన్చిన రథం మీద రావణుడు యుద్ధానికి వెళ్ళాడు.

ఇంద్రజిత్తును చంపిన లక్ష్మణుడిని చూడగానే అతడికి ఆగ్రహావేశం ముంచుకొచ్చింది. ఒకప్పుడు బంధ విమోచనకు మారుపణంగా ఇంద్రుడి నుంచి తీసుకున్న శక్తిమహాయుధాస్త్రాన్ని రావణుడు లక్ష్మణుడిపై వేశాడు. లక్ష్మణుడు పడిపోయాడు.

హనుమంతుడు క్షణాల మీద హిమాలయ పర్వతానికెళ్ళి సూర్యోదయంలోపలే సంజీవిని తెచ్చి, మూర్ఛ నుండి లక్ష్మణుడిని కాపాడాడు.

రామరావణుల మధ్య యుద్ధం జరుగుతున్నప్పుడు, దేవలోకం నుండి ఇంద్రుడు రాముడికి మాతలి సారథిగా దివ్యరథాన్ని పంపాడు.

రామరావణ భీషణ సంగ్రామంలో రావణుడి తలలు తెగిపడి నేలమీద దొర్లుతూంటే తిరిగి తలలు మొలుచుకొస్తున్నాయి.

అప్పుడు విభీషణుడు రాముడితో రావణుడి కడుపులో ఉన్న అమృత

భాండం ఊడిపడేలాగ భేదించమని చెప్పాడు. రాముడు బ్రహ్మాస్త్రంతో ఆ పని చేశాడు.

రావణుడు ఒంటితలతో ఏకాకిగా నేల కూలాడు.

ఆ విధంగా గుట్టుమట్లన్నీ చెప్పిన విభీషణుడివల్ల, "ఇంటిగుట్టు లంకకు చేటు!" అనే సామెత వచ్చింది.

రావణ సంహారంతో లంకాసామ్రాజ్యం పతనమై రాక్షస రాజ్యం అంతరించింది. విభీషణుడు లంకకు రాజయ్యాడు.

రావణ కుంభకర్ణుల చావుతో జయ విజయుల రెండో జన్మ ముగిసింది.

అశోకవనం నుండి సీత వచ్చింది.

రాముడు, "సీతా! దుర్మార్గుణ్ణి శిక్షించి రాజుగా నా కర్తవ్యాన్ని నిర్వర్తించాను. నిన్ను రావణుడు ఎత్తుకెళ్ళి లంకలో ఉంచాడు. నిన్ను నేను ఎలాగ స్వీకరించి అయోధ్యకు తీసుకెళ్ళగలను? ఇక నీ యిష్టానుసారంగా నీవు నడుచుకో వచ్చును!" అని చెప్పాడు.

సీత అక్కడున్నవారితో ఆజ్ఞాపిస్తున్నట్లుగా తనకోసం అగ్నిగుండాన్ని సిద్ధం చేయమని చెప్పింది.

సీత రాముడి పాదాలపై దృష్టి నిలిపి భక్తితో నమస్కరించి, అగ్నిలోకి దూకింది. అగ్నిగుండంలో జ్వాలలు ఉవ్వెత్తున లేచాయి.

ఆ జ్వాలలోంచి అగ్నిదేవుడు సీతను నవవికసిత పద్మంలాగ దోసిట ఎత్తి వచ్చి, "రామా! సీత నిప్పులాంటిది! పావని! స్వీకరించు!" అని చెప్పాడు.

అదే సమయంలో స్వర్గంనుండి దశరథుడు విమానంలో అందరికీ కనిపించి, "నాయనా! రామచంద్రా! అగ్నిపరీక్షలో సీత పవిత్రురాలని నిరూపణ అయింది. సీతతో అయోధ్యకు వెళ్ళి రాజ్యపాలన చెయ్యి!" అని కుమారుని ప్రేమతో ఆదేశించాడు.

రాముడు ఎందరు ఎక్కినా నిండని పుష్పక విమానంలో అందరితో అయోధ్యకు చేరాడు.






# ప్రతీకారం

పర్షియా దేశంలోని ఒకానొక ప్రాంతంలో, తబరిస్థాన్ అనే చిన్న రాజ్యం ఒకటి వుండేది. దానిని పాలించే రాజుకు యిద్దరు వజీర్లు. పెద్దవజీరు కుమార్తె గొప్ప సౌందర్యవతి. ఆమెను చూసిన రాజు, ఒకనాడు వజీరుతో, ''నీకు చాలా సంతోషం కలిగించే వార్త! నీ కుమార్తెను నేను పెళ్లాడదలిచాను. ముహూర్తం ఎంత త్వరగా ఏర్పాటు చేయగలిగితే అంత మంచిది,'' అన్నాడు.

వజీరు ఒక క్షణకాలం నిర్ఘాంతపోయి, ''ప్రభూ, నా కుమార్తె విద్యావతి, తెలివిగలది. గొప్ప భక్తురాలు. ఈ వివాహం విషయం ఆమెతో ముందు మాట్లాడాలి,'' అన్నాడు.

''అలాగే తప్పక మాట్లాడు. తన అదృష్టానికి చాలా మురిసిపోతుంది,'' అన్నాడు రాజు గర్వంగా.

కాని, వజీరు యీ సంగతి చెప్పినప్పుడు ఆమె సంతోషించకపోగా, ఎంతో అయిష్టంగా, ''నాన్నా, ఈ రాజును నేను పెళ్ళాడను. ఆయన తన అంతఃపురంలోని స్త్రీలలాగే, నన్నూ బానిస కింద చూస్తాడు,'' అన్నది.

పెద్ద వజీరు యీ సంగతి రాజుకు చెప్పగానే, అతడు ఉగ్రుడైపోయి, ''నేను బలవంతంగా అయినాసరే, నీ కూతురును తప్పక పెళ్ళాడతాను. నన్ను ఆటంకపరచగల వాళ్ళెవరు?'' అంటూ పెద్దగా అరిచాడు.

ఇక నగరంలో వుండడం ప్రమాదం అనుకుని వజీరూ, అతడి కుమార్తే గుర్రాల మీద నగరం వదిలి పారిపోసాగారు. వేగుల ద్వారా యీ సంగతి విన్న రాజు, తన అంగరక్షకులతో గుర్రాల మీద వాళ్ళను వెంబడించాడు.

అరేబియా కథ



ఒక గంట తరవాత రాజు, వజీరునూ, అతడి కుమార్తెనూ పట్టుకోగలిగాడు. తరవాత నిర్దాక్షిణ్యంగా కత్తితో వజీరు తల నరికి, అతడి కుమార్తెను నగరానికి తీసుకు వచ్చాడు.

"నీకెంత గర్వం! రాజైన నన్నే వివాహమాడేందుకు నిరాకరిస్తావా? ఎవరు నీకు దిక్కు?" అని రాజు, వజీరు కుమార్తెను కోపంగా ప్రశ్నించాడు.

"నేను చేయగలిగిందేమీ లేదు. దేవుడే నాకు రక్ష!" అన్నది వజీరుకుమార్తె.

ఇది జరిగిన మర్నాడే రాజుకు తన వేగుల ద్వారా, రాజ్యంలో ఒక ప్రాంతాన ప్రజలు తిరుగుబాటు చేసినట్టు వార్త అందింది. వెంటనే అతడు, పెద్ద వజీరు కుమార్తె పారిపోకుండా కాపాడే పని చిన్న వజీరుకు వప్పచెప్పి, సైన్యంతో బయలుదేరి పోయాడు.

వజీరు కుమార్తె అంతఃపురంలోని ఒక చిన్న గదిలో బంధించబడింది. చిన్న వజీరు కిటికీలోంచి ఆమెను చూసి, ఆమె అందానికి పరవశుడైపోయాడు. అతడు తనకు నమ్మకస్థురాలైన ఒక దాసీదాన్ని వజీరు కుమార్తె వద్దకు పంపాడు.

దాసీది ఆమెతో, "నా యజమానికి నువ్వంటె చాలా అభిమానం కలిగింది. ఆయనకు ఈ దాపుల్లోనే అందమైన పూల తోట వున్నది. ఆయన వెంట వెళ్ళి హాయిగా, ఆ తోటలో తిరిగి రావచ్చు. ఈ సంగతి రాజుకు తెలిసే అవకాశం లేదు," అన్నది.

దానికి వజీరు కుమార్తె ఎంతో విచారంగా, "ఇప్పటి నా స్థితి పూలతోటల్లో షికారు తిరిగేలా వున్నదా? నా తండ్రి, నా కళ్ళ ఎదటే చంపబడ్డాడు. నన్ను బలవంతంగా యిక్కడికి లాక్కు వచ్చారు. మీ యజమానికి మరేనాడూ, యిలా కబురు పెట్టవద్దని చెప్పు." అని సమాధానం యిచ్చింది.

చిన్నవజీరు, దాసీది తిరిగివచ్చి చెప్పినది విని భయపడ్డాడు. వజీరు కుమార్తె,

యీ సంగతి రాజుతో చెబితే, తనకు శిక్ష తప్పదు. ఇలా ఆలోచించి, అతడు రాజు తిరిగివచ్చి, వజీరు కుమార్తె ఎలా వున్న దని అడగగానే, "ప్రభూ, ఆమె తమ వంటివారికి భార్య కాదగినది కాదు. మీరటు వెళ్ళగానే, ఆమె ఒక దాసీదాన్ని నా దగ్గిరకు పంపింది. అది చెప్పిన దేమంటే, వజీరు కుమార్తె నాతోపాటు మరేదైనా దేశానికి పారిపోయేందుకు సిద్ధంగా వున్నదట! అక్కడ వివాహం చేసుకుని సుఖంగా వుండవచ్చునట! నేనందుకు ఒప్పుకోక, గట్టిగా మంద లించాను," అని అబద్ధాలు చెప్పాడు.



రాజు పట్టరాని కోపంతో, "అలాగా! అయితే యీ దుర్మార్గురాలిని ఎలా చంపడం? శిరశ్ఛేదమా? ప్రాణాలతో పాతిపెట్టడమా?" అన్నాడు.

చిన్నవజీరు ఏదో చెప్పబోయేంతలో, అక్కడ వున్న ముసలి నౌకరు ఒకడు, "ప్రభూ, తొందరపడకండి. ఆవిణ్ణి ఏదైనా ఎడారి ప్రాంతాన వదలడం మంచిది. అక్కడ చావో, బతుకో విధి నిర్ణయిస్తుంది!" అని సలహా యిచ్చాడు వినయంగా.

"అలాగే చెయ్యండి!" అన్నాడు రాజు.

భటులామెను కొండలూ, గుట్టలూ, ఇసుక ప్రదేశాలూ వున్న ఒక భయంకర ప్రాంతాన వదిలారు. వజీరు కుమార్తె చేతులు ఆకాశంకేసి ఎత్తి, దైవప్రార్థన చేస్తూ నిలబడింది. ఆ సమయంలో అటుగా పోతున్న ఒక ఒంటెల్ని తోలేవాడు, ఆమెను చూశాడు.

వాడు, వజీరు కుమార్తె దగ్గిరకు వచ్చి, "అమ్మా, నువ్వు, మా ఇంటికి రా. నీ కొచ్చిన భయం ఏమీలేదు," అన్నాడు జాలిపడుతూ.

వజీరు కుమార్తె అతడికి తన కృతజ్ఞత చెప్పుకుని, "అయ్యా, నన్ను యిక్కడే వుండనివ్వండి. ముందు దాహం తీర్చుకునేందుకు, నీరున్న ప్రదేశం చూపండి, చాలు," అన్నది.



ఒంటెలు తోలేవాడు ఆమెను ఒక నీటికొలను దగ్గరకు తీసుకుపోయి వది లాడు. అతను పొరుగు దేశపు యువరాజు నౌకరు. ఈ యువరాజు గొప్ప సైనికబలం కలవాడు. నౌకరు, ఆయనకు వజీరు కుమార్తెను గురించి చెప్పాడు.

యువరాజు అప్పటికప్పుడు బయలు దేరి ఆమె వున్న ఛోటుకు వచ్చాడు. అంత సౌందర్యవతిని, ఆనాటివరకూ అతడు చూసి వుండలేదు.

యువరాజు వజీరు కుమార్తెకు తానెవ రైనదీ చెప్పుకుని, "నగరానికి వచ్చి, నా ఆతిథ్యం స్వీకరించవలసిందిగా కోరు తున్నాను," అన్నాడు.

వజీరు కూతురు అందుకు ఒప్పుకోక, ఆ ఎడారిప్రదేశాన కొలను వద్ద వుండిపో దలిచినట్టు అతడికి చెప్పింది.

యువరాజు నగరానికి తిరిగిపోయాడు. కాని, ఆ రాత్రి అతడికి సరిగా నిద్రపట్ట లేదు. ఎడారిలో ఒంటరిగా వున్న వజీరు కూతురుకు ఏదైనా అపాయం కలగవచ్చు నన్న అనుమానం కలిగింది.

అతడు మరుసటి రోజు రాత్రి కొలను దగ్గిరకుపోయి, ఒక చెట్టు కింద కూర్చు న్నాడు. ఉదయానే వజీరు కూతురు అతణ్ణి చూసి ఆశ్చర్యపోయి, "మీరు రాజ్యపాలకులు, నగరం వదిలి రావడం క్షేమం కాదు. తిరిగి వెళ్ళి, మీ పరిపాలనా వ్యవహారాలు చూసుకోండి," అన్నది.

"నువ్వన్నమాట నిజం. కాని, నువ్వు నన్ను వివాహమాడేందుకు ఒప్పుకుంటే తప్ప, నగరానికి తిరిగిపోను," అన్నాడు యువరాజు.

ఆ జవాబుకు వజీరు కుమార్తె కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "నన్ను కాపాడే ప్రయ త్నంలో నా తండ్రి దుర్మరణం పాలయ్యాడు. తను ఎంతో విశ్వాసంతో సేవించిన రాజే, దుర్మార్గుడై ఆయన్ని చంపడం జరిగింది. అందుకు ప్రతీకారం జరగనిదే, నేను వివాహం గురించి ఆలో చించలేను," అన్నది.

తరవాత ఆమె, యువరాజుకు జరిగిన దంతా చెప్పింది.

వెంటనే యువరాజు నగరానికి తిరిగి పోయి, తన సేనాని నాయకత్వంలో పెద్ద సైన్యాన్ని తబరిస్థాన్ పైకి పంపాడు. సేనాని రాజునూ, అతడి చిన్న వజీరునూ పెడరెక్కలు విరిచికట్టి, యువరాజు దగ్గిరకు తెచ్చాడు.

యువరాజు బందీలతో వజీరు కుమార్తె దగ్గిరకు రాగా, ఆమె తనకు శిరశ్ఛేదం కాకుండా కాపాడిన ముసలి నౌకరును కూడా తీసుకు రావలసిందిగా కోరింది. సైనికులు అతణ్ణి సగౌరవంగా తీసుకు వచ్చి ఆమె ముందు నిలిపారు.

బందీలతో యువరాజూ, వజీరు కుమార్తే నగరం చేరారు. అక్కడ ఆమె, నిండు సభలో చిన్న వజీరును జరిగిన దేమిటో నిజం చెప్పమన్నది. వజీరు అమితమైన ప్రాణభయంతో వణికిపోతూ, రాజుకు తాను అబద్ధం చెప్పినట్టు ఒప్పుకున్నాడు.

యువరాజు, అతణ్ణి ఇసుక ఎడారిలో వదిలి రావలసిందిగా సైనికులను ఆజ్ఞాపించాడు. కొద్దిరోజుల తరవాత, ఆ దారే పోయే బిడారివర్తకులకు, అతడు దారి పక్కన చచ్చిపడి వుండడం కనిపించింది.

ఇక దుష్టుడైన రాజు కూడా బలవన్మరణం పాలయ్యాడు. నిర్దోషి అయిన పెద్ద వజీరును అతడు ఏ విధంగా కత్తితో తల నరికి చంపాడో, అదేవిధంగా యువరాజు తన భటులచేత, అతడి తల నరికించాడు.

ముసలి నౌకరును యువరాజు తన రాజ్యంలోని ఒక ప్రాంతానికి పాలకుణ్ణి చేయడమే కాక, చాలా ధనం యిచ్చి గౌరవించాడు.

ఎన్నాళ్ళుగానో తండ్రి మరణానికి దుఃఖిస్తున్న వజీరు కూతురు, యిలా ప్రతీకారం జరిగాక, చిరునవ్వు నవ్వింది. ఇప్పుడు ఆమె తనను వివాహమాడేందుకు యిష్టపడుతున్నదని గ్రహించి, యువరాజు పరమానందం చెందాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



S. Ganapathy

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బొమ్మతో నేస్తం

రెండవ ఫోటో: నాన్నతో హాస్యం

పంపినవారు: లక్ష్మీశర్వాణి, వి. ఎల్. పురం, బాపట్ల (గుంటూరు జిల్లా)

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా ? సమాధానాలు :

1. ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రతినిధి అయిన జాబ్ చార్‌నాక్; 1690వ సంవత్సరంలో 2. అక్బర్ చక్రవర్తి
3. డయోడరస్ 4. బర్మా రాజు బోడాపాయ; మణిపూర్‌మా, అస్సాంలో కొంతభాగాన్ని ఆక్రమించుకున్నారు.
5. రాజా రామ్‌మోహన్ రాయ్

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి. (వి. పి. పి. చార్జీలు అదనం)




# MERI GOLD COVERING WORKS

**P.O. BOX 1405, 14, RANGANATHAN STREET**
**T. NAGAR MADRAS-600 017 INDIA**

**Results of Chandamama Camlin Colouring Contest No.33. (Telugu)**

H. Yadaiah, Panga Reddy. *2nd Prize:* T.S.V. Ramesh, Hyderabad-5. Ch. Sudhakar, Kakinada 533 004. L. Sri Ranga Pani, Cuddapah 516 001. *3rd Prize:* L. Gouri Sankar, Kothapeta. K. Kalyana Chakravarthy, Kakinanda 533 001. B.S.S. Sreenivas, Vizianagaram-2. P.H. Sirisha, Kakinada 533 004. Nimmana Raju, 24 Parganas. M. Sheshachary, Hyderabad 500 028. G. Kiran Kumar Goud, Nizamabad 503 214. P.V. Rajani, Vijayawada. B. Koushik, Hyderabad. P. Srinivasachari, Vizag 530 013.

## రాజు దగ్గర, వాళ్ళ తరగతిలో అందరికన్నా ఎక్కువగా మంచివి బలే స్టాంప్‌లు ఉన్నాయి.

అతని స్టాంప్‌లు చూసినప్పుడల్లా అతని స్నేహితులకు చాలా అసూయ కలుగుతుంది. అతని దగ్గర వాకలు, అంతరిక్షం, క్రీడల గురించిన స్టాంప్‌లు ఉన్నాయి — చాలా ఎక్కువగా కూడా ఉన్నాయి.
ష్‌ష్‌ష్... అతని రహస్యం బయటపడిపోయింది. రాజుకి సోవియట్ యూనియన్‌కి చెందిన స్నేహితుడు ఉన్నాడు. అతనికి స్టాంపుల సేకరణ గురించిన అన్ని విషయాలు తెలుసు. రాజు మంచి ఉత్తేజకరంగా స్టాంప్ లను సేకరించుకోవడంలో అతను సహాయపడతాడు.

## మీరు కూడా జోయిష్కాతో స్నేహం చేసుకుని, అద్భుతమైన స్టాంప్‌ల సేకరణని ప్రారంభించవచ్చును.



సోవియట్ తపాలా బిళ్ళలు అందంగా ఉంటాయి... వాటి మీద అనేక అంశాల గురించిన అందమైన రంగు రంగుల బొమ్మలు ఉంటాయి.
ఆ తపాలా బిళ్ళలు, మీ స్టాంప్‌ల సేకరణ హాబీని మరింత ఆనందదాయకంగా, ఉత్తేజకరంగా చేయడమేగాక, వాటి ద్వారా మీరు ఎన్నో విషయాలు తెలుసుకుంటారు - అంతేకాదు... అవి ఎన్నో విధాల ప్రయోజనకరమైనవిగా మీరు తెలుసుకుంటారు.

## వెంటనే సేకరించడం ప్రారంభించండి.

1. ఈ క్రింది వాటిలో నుంచి మీకు యిష్టమైన అంశాన్ని ఎంపిక చేసుకోండి.
   - అంతరిక్షం • క్రీడలు_వినోద పర్యటన • పువ్వులు • జంతువులు • కళ (చిత్రలేఖనం, శిల్పకళ మొ.) • సముద్ర జీవాలు • రవాణా (రైల్వేలు, విమానాలు, వాకలు & కార్లు) అక్టోబరు మహా విప్లవం • కమ్యూనిస్టు పార్టీ • లెనిన్ • అసోర్టెడ్ స్టాంప్‌లు.
2. ఇప్పుడు ఈ సూపర్ నదుపాయాన్ని పరిశీలించండి - మీరు ఖర్చుచేసే డబ్బు విలువ మేరకు మీకు తపాలా బిళ్ళలు లభించడమేకాదు, జోయిష్కా నుంచి ఆశ్చర్యకరమైన అనేక బహుమతులుకూడా ఉంటాయి. అంతేకాకుండా, తపాలాబిళ్ళలగురించి రంగురంగుల చిన్న పుస్తకం ఒకటి మీకు లభిస్తుంది. ప్యాకెట్లు, అల్బమ్‌లు, కొత్తగా ప్రచురితమయినవి, వాడేసినవి, వాడనటువంటివి స్టాంప్‌లు, మొదటి రోజు కవర్లు వీటి ధరల జాబితాలపూర్తి సెట్టు కూడా లభిస్తుంది - ఉచితంగా.
3. మీ సేకరణ ఎంత త్వరగా పెరగాలో నిర్ణయించుకుని, ఈ క్రింది వాటి నుంచి ఎంపిక చేసుకోండి.

| సేకరణ | మీరు చెల్లించేది | మీకు లభించేది | మీ ఎంపిక |
|---|---|---|---|
| ఎ. | రు. 25 | 50కి పైగా స్టాంప్‌లు | 1 లేదా అంతకంటె ఎక్కువ అంశాలు. |
| బి. | రు. 50 | 100కి పైగా స్టాంప్‌లు | 1 లేదా అంతకంటె ఎక్కువ అంశాలు |
| సి | రు. 100 | 200కి పైగా స్టాంప్‌లు | కనీసం 3 అంశాలు |
| డి | రు. 200 | 400కి పైగా స్టాంప్‌లు | కనీసం 5 అంశాలు |

4. మీకు కావలసిందేమిటో ఎంపిక చేసుకున్న తరువాత చినార్ ఎక్స్‌పోర్ట్స్‌కి వ్రాయండి. (ఎ) మీ పేరు (బి) మీ చిరునామా (సి) మీరు ఎంచుకున్న అంశం, లేదా అంశాలు (డి) మీరు ఎంచుకున్న సేకరణ.

దీనితోబాటు చినార్ ఎక్స్‌పోర్ట్స్ ప్రై.లి., న్యూ ఢిల్లీ పేరిట మనిఆర్డర్ పోస్టల్ ఆర్డర్/బ్యాంక్ డ్రాఫ్ట్ పంపించండి.

**CHINAR EXPORTS PVT LTD**
101-A, Surya Kiran, Kasturba Gandhi Marg,
New Delhi-110001. (INDIA)
Phones: 35–2023, 35–2123
• Cable: VILPANA • Telex: 314212

స్టాంప్‌లు అసలైనవేనని, నకిలీవి కావని మీ ఆర్డరు అందిన తరువాత రెండు వారాలలో, ఎక్కడా పాడైపోకుండా చక్కటి స్థితిలో మీకు అందుతాయని మీరు పూర్తి నమ్మకంతో ఉండవచ్చును.

మీరు అన్ని కరోనా షూ స్టోర్స్‌లలోను, సోవియట్ పుస్తక దుకాణాలలోను కూడా సోవియట్ స్టాంప్‌లు కొనుక్కోవచ్చును.

Shems/CEPD/83